శ్రీ

# లుబ్ధాగ్రేసరచక్రవర్తి.

(నాటకము.)




సెట్టి లక్ష్మీనరసింహము, బి. ఏ., ఎల్.




వా... అండ్ కంపెనీచే ప్రచురితము,

విశాఖపట్టణము.

---

1914

# పీఠిక.

సంస్కృతభాషకు కాళిదాసమహాకవియు, ఆంగ్లేయభాషకు షేక్స్పియరుమహాకవియు ఎట్టివారో, అట్టివాఁడే ఫ్రెంచిభాషకు మోలియరుమహాకవి. షేక్స్పియరు వలెనే మోలియరును నాటకములయందు వేషములు వేయునైపుణ్యముగలవాఁడు గావున, అతనికి నాటకరచనామర్మములు చక్కఁగా తెలియును. ఆ కారణముననే మోలియరునాటకము లంతసుప్రసిద్ధములు. ఆనాటకములయందు వన్నె కెక్కినవానిలో ఒకటి, ఇప్పుడు నేను తెలుఁగుభాషలోనికి మార్చిన ఈనాటకము. ఇందు గుణములన్నివి ఉన్నయెడల, అవి మోలియరుమహాకవివానిగానే భావించియైనను చదువరులు సంతోషింతురు గాక!

విశాఖపట్టణము,
1 జనేవరి 1914

సెట్టి లక్ష్మణ

VI

# నాటకపాత్రలు.

---

## పురుషులు.

1. ధనదాసు–లుబ్ధాగ్రేసరచక్రవర్తి.
2. సుందరం–ధనదాసు కొడుకు; రాధప్రియుఁడు.
3. బలరాం–కమలప్రియుఁడు.
4. ముసలయ్య–కమలకు ధనదాసు నిశ్చయించిన వరుఁడు.
5. కామయ్యసెట్టి–అప్పులు కుదుర్చు మధ్యవర్తి.
6. రామన్న–సుందరం నౌకరు.
7. జగ్గన్న–ధనదాసు వంటపుట్టి; బండివాఁడు.
8. కన్నయ్య }
9. సోములు } –ధనదాసు నౌకరులు.
10. సబ్బినస్పెక్టరు.

## స్త్రీలు.

...సు మోహించిన చిన్నది; సుందరం ప్రియురాలు.

...కూఁతురు; బలరాం ప్రియురాలు.

...జీవించు ఆఁడుది.

## రంగము.

...నదాసు ఇల్లు.

---

శ్రీ

# లుబ్ధాగ్రేసర చక్రవర్తి.

## I అంకము.

### 1 రంగము—[బలరాం, కమల, ప్రవేశింతురు.]

బల— కమలా, అబ్బా! ప్రాణం కటకట కొరుక్కుతిన్నావే ! నీచేత ఊఁ అనిపించే సరికి తలప్రాణం తోకకు వచ్చింది. నామీద నీకిష్టం ఉన్నదన్న ముడిమాటకొప్పుకొనే ఒప్పుకొన్నావు గదా, ఇక ముడి కొప్పు కోవడానికెందుకంత వెనకతీశావు?......ఏం, అలాగు ఉన్నరంటూ నిట్టూర్పు విడుస్తున్నావు? నాకూ నీకూ పెళ్లి జరగడం, అందువల్ల నాకు సంతోషం కలగడం, ఇవేవీ నీకిష్టం లేదు కాబోలు!

కమ—అయ్యో మనోహరా,.

బల— అదిగో, మనోహరా అనకు; ఎవరైనా వింటే చిక్కు వస్తుంది. పేరు పెట్టి 'బలరాం' అనే పిలు. పెళ్లయిన తరువాతే కదా నా పేరు నువ్వూ, నీ పేరు నేనూ, ఎత్తకూడదు?

కమ— మీకు సంతోషం కలిగించడం నాకిష్టం లేదంటూ ఉన్నారు. మీరేం చెప్పితే అదంతా చేసి మీ మనస్సుకు సంపూర్ణ సంతోషం కలిగించడమే నాకు ప్రధానం.

బల— అయితే అక్కడికి పెళ్లికిముందు ప్రధానం కూడా జరిగినట్టే. లాంఛనాలలో ఏమీ లోపం లేదు.

కమ—మీకిప్పుడున్న కులాసా చూచి నాకు కలుగుతూ ఉన్న సంతోషం ఇంతా అంతా కాదు. అయినా అదేమో కాని మనస్సులో ఏదో చింత ఉన్నట్టు గుండె దడదడలాడుతూ ఉంది. ఏం కొంప మునుగుతుందో? లేక పోతే, మీ మీద నాకింత వెర్రిమోహమేమిటి?

బల— కొంప మునగడమేం? కొంపొకటి నిలుస్తుంది ఇంకా కావలిస్తే. నీకు కలుగుతూ ఉన్న మోహమూ వెర్రిది, చింత వెర్రిది గాని?

కమ—అదేం, అలాగంటారు? మా నాన్నగారికి కోపం వస్తుందేమో అన్న బెంగ ఉండవలసినదేనా? మా బంధువులు నన్ను తిడతారేమో అన్న జడుపు పుట్ట వలసినదేనా? లోకులేం అపనింద మోపుతారో అన్న జంకు కలగ వలసినదేనా? ఈ చింతలన్నీ ఈ లాగుండగా, ఇన్నిటి కంటే ఎక్కువ చింత మరొకటి నా మనస్సును బాధిస్తూ ఉంది: అదేమిటంటే, మీకంతకంతకూ నామీదనున్న మోహం తగ్గిపోతుందేమో గదా భగవంతుడా అని.

బల— ఆహా! నీచింతకు చిగుళ్లూ, కొమ్మలూ, పలవలూ, లేస్తున్నవే!

కమ—ఆడది వలిస్తే గాడిదన్న సామెతే ఉంది. వలచి నమ్మిన ఆడవాళ్లను మీ మొగవాళ్లెంత అనాడీ చేస్తారో లోకప్రసిద్ధమే.

బల— అయ్యో! కమలా, ఎంత మాటన్నావు? నేను నిన్నెప్పుడైనా అనాడీ చేస్తానా? అయితే నన్నూ తక్కిన మొగవాళ్లతో పాటే కట్టేశావంటూ? తక్కిన లోపాలెన్నయినా నాలో ఉండవచ్చును గాని, నీకు మాత్రం ఎప్పుడూ ఏ లోపమూ చెయ్యవలసిన వాడను కానని ముమ్మాటికీ నమ్ము. లోపం ఎందుకు చేస్తాను? నాకున్నది కల్లబొల్లి ప్రేమ గనకనా? ప్రాణమున్నన్నాళ్లూ నువ్వే నా ప్రాణప్రియవు; ప్రాణేశ్వరివి; ప్రాణాధికురాలవు.

కమ—మొగవాళ్లందరూ వల్లన వేసిన ముక్కలే ఇవి. మాటల మెప్పుకు మొగవాళ్లందరూ ఒక్కచ్చు. క్రియలలోనే తెలుస్తుంది ఎవరేలాటివాళ్లో.

బల— అయితే నా క్రియల బట్టే మాతువు గాని నేనేలాటివాడనో. ఇప్పటికింకా నామనస్సు నీకు బోధపడకనే పోతే, అప్పుడే ఆయెను. అంతే కాని లేని పోని అనుమానాలు పెట్టుకొని బాధపడితే ఏం లాభం? అనుమానం పెనుభూతం అన్నాడు. క్రియల బట్టి నా ప్రేమ చూపించడానికి తగిన అవకాశం వచ్చిన్నీ నాలో నువ్వు లోపమే కనిపెట్టినట్టయితే అప్పు డను, ఏం మాటలంటావో; కిక్కు మెక్కు మనకుండా పడి ఊరుకుంటాను.

కమ—ఆహా! మనస్సులో మక్కువన్న దేఉన్నతరవాత మాయమాటలైనా నమ్మే బుద్ధే కదా? కానీండి, మీ మాటలు నమ్ముతున్నాను. మీరు నన్ను అనాడీ చెయ్యరనీ, మీది మోసం లేని మోహమనీ, మీ మోహం ఎప్పుడూ నిలిచి ఉంటుందనీ,—ఇంకా ఏమేం చెప్తారో అన్నీ నమ్ముతాను. ఇన్ని నమ్మిన తరవాత, ఇక మనం సుఖపడే కాలం సమీపించిందనే నమ్మ లేక పోతానా? అదీ నమ్మాను ఇక నాకు మిగిలిన చింతంతా మనం దొంగతనంగా పెళ్లాడడం మాసివింటే లోకులేమంటారో దానిని గురించి మాత్రమే.

బల— దీనినే కాబోలు చింత దచ్చినా పుల్ల చావక పోవడమంటారు?

కమ—మీ రాలాగంటే చెప్ప లేను గాని, నాకు చింత ఎందు కుండదు? లోకులలో కాకులలో అంటారు; లోకం ముయ్యడానికి మూకుడు లేదు. మీ రెవరో, ఏలాటివారో, ఏకారణంచేత మిమ్మలిని పెళ్లాడడానికి నే నొప్పుకొన్నానో, ఇవన్నీ పైవాళ్లకు తెలిస్తే ఇంకా అంత చెప్పకండి. ఇప్పు డేమంటారు? గుమస్తాతో లేచిపోయిందనేనా? మీరు గుమస్తాగారు కారు, గొప్పింటి బిడ్డలు, నామీద మోహం కొద్దీ మా

నాన్నగారి దగ్గిర నౌకరీకి కుదురుకొన్నారు, అని ఎవరికి తెలుస్తుంది? "ఏమమ్మా, తినుండ లేక దీని పోగాలం? " అనే వాళ్లే కాని, ఏట్లో పడి మునిగి పోతూ ఉన్నప్పుడు మీరు నన్ను పైకి లాగి, నా ప్రాణాలు నిలవబెట్టి, నా ప్రేమకు పాత్రులయారని, ఎవరెరుగుదురు? ఆ తరువాత మీరు నామీద అంతకంతకూ చూపించిన ఆదరం, ప్రేమ, అనురాగం, మోహం, ఇవన్నీ ఎవరు చూచారు? ఎంత మోహం కాకపోతే, నా కోసం దేశం వదులు కొంటారా? తల్లిదండ్రులను వెదకడం మానుకొంటారా? కుటుంబ గౌరవం కూడా కూల దోసుకొని కూలీ నాలీ లేని గుమస్తా పనికి కుదురు కొంటారా? ఇన్నివిధాలా మీరు నాకోసం కష్టపడడం చూచి, మీరడిగిన దానికి కాదనడానికి నాకు నోరాడింది కాదు. లోకు లనుకుంటే అనుకోనియ్యండి; ఒడి పడ్డాను.

బల— కమలా, నేను నీ ప్రాణాలు రక్షించాననీ, నీ కోసం కష్టాలు పడుతున్నాననీ, ఈ కారణాల చేతనేనా నువ్వు నన్ను పెళ్లాడడాని కొప్పుకొన్నావు? అంతే కాని నా మీద నీకు మోహం ఉండడంచేత కామూ? పోనీ, అమాత్రపు మాటకైనా నోచక పోయానా?

కమ—పోనీండి, మీరు చెప్పినట్టే కానీండి...అయ్యో! నా సిగ్గుమాలినతనం! ఎవరైనా వింటే ఏ మనుకొంటారు?

బల— ఏమనుకొంటారు? మీ నాన్నగారికి నీ మీద తగినంత అభిమానం లేక పోవడంచేతనే ఈలాగు నువ్వు స్వతంత్రించా వనుకొంటారు? కడుపున కన్న పిల్లలను కూడా దగ్గిరకు చేరనియ్యని లోభగుణం ఉన్న తండ్రులుంటే ఏం చెయ్యడం? నీ ఎదుటే మీనాన్నగారిని గురించి ఈలాగన్నానని కోపగించుకోకుమా. అవసరం వచ్చింది గనక ఉన్న సంగతి చెప్పక తీరింది కాదు. నా తల్లిదండ్రులు మాత్రం అలాంటి వాళ్లు

కాకూడదని వెయ్యి దేవుళ్లకు రాత్రీ పగలూ మొక్కుతున్నాను. వాళ్లు ఇప్పుడెక్కడున్నారో! నాలాటి దురదృష్టవంతుడికి వాళ్లు దక్కుతారో, లేదో? ప్రయత్నలోపం మాత్రం ఏమీ చెయ్యడం లేదు. కటకమంతా గాలించి వెదికిస్తున్నాను. ఏ నిమిషానికానిమిషం బోగట్టా రావచ్చును. అక్కడికీ రాక పోతే నేనే వెళ్లవలసి వస్తుంది.

కమ—అయ్యో! అయ్యో! నన్ను నడిసముద్రంలో విడిచి పెట్టకుండా, ఏదో ఒక దరికి చేర్చి మరీ వెళ్లండి. మీరిక్కడే ఉంటే మా నాన్నగారి దయ సంపాదించ వచ్చును. అలాగయితే మనం దొంగతనప్పెళ్లంటూ ఆలోచించే అక్కర లేదు.

బల— దొంగతనప్పెళ్లి నాకు మాత్రం ఇష్టమా? అంత తప్పి వస్తేనే తప్ప ఆ ఆలోచనే వద్దు. వీలయిన వరకూ నేనిక్కడే ఉంటాను; నీ నాన్నగారి దయ కూడా సంపాదిస్తాను. అందువిషయమై ఇప్పటికే ఏలాగు తంటాలు పడుతూ ఉన్నానో నువ్వు చూస్తూనే ఉన్నావు గదా? "పని నేర్చుకోవాలని ఉంది, జీతం అక్కరలేదు, గుమస్తాగా పెట్టుకోండి" అని మీ నాన్నగారి దగ్గిర ఎంత చాకచక్యంగా పనికి కుదురుకున్నాను? నాయిష్టం బొత్తిగా చంపుకొని ఆయన ఇష్టమే ప్రతీదానిలోనూ ఏలాగు ముఖ్యం చేస్తూ ఉన్నాను? ఆయన ఏమంటే దానికల్లా గంగిరెద్దులాగు ఏమో స్తరుగా తల ఊపుతూ ఉన్నాను? లోకంలో ఎవరైనా పైవాళ్లదయ సంపాదించాలంటే ఇవే మార్గాలు. అన్న ప్రతిదానికీతలఊపడం, తప్పులనుఒప్పులని సరిదిచెప్పడం, ఒప్పులను గొప్పచేసి తెగ పొగడడం, చేస్తే ఏలాటి వాళ్లయినా మంత్రానికి గానీ పాములేలాగు కట్టుపడి పోతవో, అలాగు కట్టుపడి పోతారు; మరేమీ మందూ మంత్రమూ అక్కరలేదు. ఎంత ఎక్కువ పొగడితే అంత ఎక్కువ కట్టుపడతారు. ఏ ఉద్దేశం ఉండి అలాగు పొగుడు

తూ ఉన్నారో, అన్న అనుమానం కూడా పడకుండా, గడుసువాళ్లు సహా స్తోత్రపాఠాలు వినేసరికి బుట్టలో పడిపోతారు. అసందర్భాలు కానీ అతిశయోక్తులు కానీ స్తోత్రాలయితేచాలు, అందరూ నమ్మినవాళ్లే, నమ్మి చెడినవాళ్లే! నిజమాడితేనే నిష్ఠురం; ఉన్న మాటాడితేనే ఉలికిపాటు! కాబట్టి మనకెవళ్లతో నయినా ప్రయోజనం ఉన్నట్టయితే నిజాలకొక్క ఆటవిడుపిచ్చి నోటికి శుద్ధీ బుద్ధీ లేకుండా ఆడవలసిందే అబద్ధాలు! ఆ దోషం అబద్ధాలాడే స్తోత్రపాఠకులది కాదు; ఆలాటిస్తోత్రపాఠాలు చెప్పితేనే తప్ప సంతోషించని అవివేకులదే.

కమ— అన్నట్టు, వీరు మా అన్నయ్యను మీ పక్షం ఎందుకు చేసుకోరు, మీ నేర్పు కొంచెం వినియోగించి?

బల— సుందరాన్నేనా? అబ్బో! అతడి దగ్గిర ఈ ఆటలు సాగవు. ధనదాసుగారి కొడుకన్నమాటే కాని, అతడు ధనదాసుగారి లాగు ముఖస్తోత్రాలకు చెవి ఒగ్గ వలసినవాడు కాడు. తండ్రికొడుకులకు అన్ని గుణాలలోనూ హస్తిమశకాంతరం. ఒకరి అనుగ్రహంతో పాటు రెండోవాళ్ల ఆగ్రహం సంపాదించామని నిశ్చయించుకో వలసిందే. కాబట్టి నువ్వే మీ అన్నయ్యను సాఫుచెయ్యి; నీమీద అభిమానమని చెప్పూతూ వచ్చావు గదా? అదిగో, సుందరం ఇటే వస్తున్నాడు. నేను వెళ్లిపోతాను. ఎంతవరకు మనకూలిస్తాడో వాయించి చూడడం మరిచిపోకుమా.

[బలరాం నిష్క్రమించును. సుందరం ప్రవేశించును.]

సుంద— చెల్లీ, ఒక్కర్తెవే దొరికావు గనక నీతో ఒక రహస్యపు సంగతి మాటలాడుతాను. చాలా నాళ్లనుంచీ మాటలాడా లనుకుంటున్నాను.

కమ— అన్నయ్యా, ఏం రహస్యం? చెప్పు, వింటాను.

సుంద—ఒక రహస్యం కాదు, అనేకం నేను నీతో చెప్పవలసి ఉంది. అన్నిటికీ సారాంశం మాత్రం ఒక్కటే. అదేమిటంటే, చెప్పేదా? ఆశ్చర్యపడి గట్టిగా కేక వెయ్యవు గదా?—మోహం.

కమ—మోహమా? ఎవరికి? నీకా?

సుంద—నాకు కాకపోతే మరెవరికి? ఏం, అలాగు కళ్లు వెళ్లబెట్టి చూస్తున్నావు?...అవునవును; నువ్వేమంటావో నాకు తెలుసును. నాది పొరపాటే; మోహం కలిగిన తరువాత నాన్నగారికి చెప్పకుండా అన్ని లోపాయికారీ ఏర్పాటులూ చెయ్యడానికి ప్రయత్నించడం నాది ఘోరతప్పితమే; తండ్రి ఆజ్ఞ చెల్లించడం కొడుకుకు విధే; తండ్రి దేవుడి లాటి వాడు కాబట్టి ఆయన కళ్లు కప్పబోవడం దేవుడి కళ్లు కప్పబోవడమే; మన కంటె ఎక్కువకాలం గడిపిన వారు కాబట్టి మనకంటే నాన్న గారే సంబంధం కుదుర్చడానికి తగినవారు. ఇందులో ఒకటీ నేను కాదనను; నువ్వు నాకు బోధపరచనక్కరలేదు. అయితే నేనేంచేసేది? నాకున్న ఎక్కువ మోహం కొద్దీ ఈసంగతు లేవీ వాతల కెక్కడం లేదు.

కమ—అయితే నువ్వు మోహించిన చిన్నదానిని పెళ్లాడడాని కప్పుడే మాట ఇచ్చావు కాబోలు!

సుంద—ఇయ్యలేదు కాని ఇయ్యడానికి నిశ్చయించాను. నువ్వుమాత్రం వద్దనకు. లాభం ఉండదు.

కమ—అయితే అన్నయ్యా, నన్ను జ్ఞానం లేనిదాని కింద కట్టేశావా?

సుంద—జ్ఞానం లేనిదానవు కావు; మోహం లేని దానవు. మోహం మనుష్యుల చేత ఎన్నాటలయినా ఆడిస్తుందిగదా? దాని కున్న శక్తి లోకంలో మరి దేనికీ లేదు. ఆశక్తి నీకు తెలియక, నువ్వు నాకు బుద్ధి చెప్ప వస్తావని భయంగా ఉంది.

కమ—అన్నయ్యా, నా బుద్ధి మాటకేం లే. లోకంలో ప్రతివాళ్లకూ ఎప్పుడో ఒక మారయినా బుద్ధి పొరపాటురాక మానదు. నేను మాత్రం ఎవరి కంటే ఏమంత మహాబుద్ధిమంతురాలను ?

సుంద—చెల్లీ, దేవుడిపుణ్యమా అంటూ నీకూ నాలాగే మనస్సులో మోహం—

కమ—అన్నయ్యా, నా మాటెందుకు ? నీ సంగతి మొదట చెప్పు. నువ్వు మోహించిన చిన్న దెవరు ? ఎక్కడుంటుంది ?

సుంద—ఆ చిన్నది ఈ మధ్యనే మనవీధికి వచ్చింది. మొగవాళ్లను మోహ పెట్టడానికే ఆ పిల్ల పుట్టిందని చెప్పవచ్చును; సృష్టిలో అంతటి చక్కనిది మరొకర్తె ఉండబోదు. ఆమెను చూచిన దగ్గరనుంచీ నాకు మతి పోయింది. ఆమె పేరు రాధ;—ఆహా! నేను కృష్ణుడ నైతేనా! ఎందుకు గొంతెమ్మ కోరికలు?...ఆ పిల్లా తల్లీ కలిసి కాపురమున్నారు. తల్లి పాపం! నిత్యరోగి. ఆతల్లికి పథ్యపానాదులు చూస్తూ, ఉపచారం చేస్తూ ఉంది ఈ పిల్ల. ఆ ఉపచారంచేస్తూ ఉన్నప్పుడు ఎంత ప్రేమ! ఎంత ఆదరం! ఎంత అణకువ! ఎంత శాంతం! ఎంత పొందిక! ఎంత మర్యాద! ఎంత మప్పితం!— ఆహా! చెల్లీ, ఆమెను నువ్వు చూడవలసింది!

కమ—అన్నయ్యా, నీ వర్ణన ఏం తక్కువగా ఉందా, ఆవిడ సుగుణాలన్నీ నాకు బోధపడక పోవడానికి? ఇంతకూ, ఆమె గుణాలేలాటివైతే నేం? నువ్వామెను మోహించినావన్నదే నాకు కావలసింది.

సుంద—ఇకఅప్పై, నేను రహస్యంగా వాళ్లకు తెలియకుండా బోగట్టాచేశాను, వాళ్ల స్థితిగతుల గురించి. వాళ్ల స్థితి బొత్తిగా చితికి పోయింది; తిన్నగా జరుగుబడి కూడా వెళ్లడం లేదు; పూటబత్తెం, ఫుల్లవెరువూ, అన్నట్టుంది. అక్కడకీ ఎంతో పొదుపుగానూ ఎంతో గుట్టు

గాగా కాలక్షేపం చేస్తున్నారు, పాపం! చెల్లీ, ఈ లాటవస్థలో వాళ్లకు నే నేమైనా సహాయం చెయ్య గలిగితే నాకెంత సంతోషంగా ఉంటుంది! నేను మోహించినందుకు నాకది విధి గదా! అయితే ఏం చెయ్యను? నాన్నగారి లోభగుణంచేత చేతిలో దమ్మిడీ అయినా ఆడడం లేదు; ఇక నా మొఖం, నేనేం సహాయం చేసేది? నామోహం వాళ్లకే విధాన్నా లాభించింది కాదు గదా అని మొత్తుకోవడం తప్ప నాచేత ఏమవుతుంది?

కమ—అన్నయ్యా, అవును పాపం! నీకు మహా చెడ్డ చిక్కే వచ్చింది.

సుంద—చిక్కన్నా చిక్కా? పిసినిగొట్టుతనం చేత నాన్నగారు గిల్లిన దాని లోనే గిల్లి చిదిమినదానిల్లోనే చిదిమి, మనకు పెడుతూ ఉన్న ఇబ్బంది తలచుకొంటే, కటిక వాడికైనా ఇంతకంటే కనికరం ఉంటుందనిపిస్తుంది. కోటీశ్వరుడి బిడ్డలమయిన్నీ కొత్త కాసు చేతిలో లేని ఘోర పేదరికం మనకు సంప్రాప్తమయింది. అనుభవించ వలసిన కాలం కాస్తా పోయిన తరువాత ఎంత సొమ్ము వచ్చి ఏం ప్రయోజనం? అంత వరకూ పళ్లిగరగరుచుకొని కూర్చోవలసిందేగదా? ఏవేళ కావేళ కలుముఖాలా అప్పు చేస్తూ ఉంటే నే తప్పనాకు నినచర్య గడవకుండా ఉంది. వర్తకులు దయతలచి అరువియ్య బట్టి గాని, లేకపోతే మనమిప్పుడు కట్టుకొన్న ఈ గుడ్డముక్కలకైనా మొగం వాచి పోదుము. ఈ సోదె అంతా ఎందుకు నీ దగ్గిర వెళ్లబోసుకొంటున్నానంటే, నువ్వు నావివాహం గురించి ప్రసంగం తెచ్చి నాన్నగారిని కొంచెం కదిపి చూడు. నా ఇష్టానికి ఆయన అనుకూలిస్తే సరేసరి; లేకపోతే వెంటనే వేరింటి కాపురం వెళ్లిపోవడానికి నిశ్చయించుకొన్నాను. ఈ గంజీ నీళ్లూ పైచోట దొరకక పోవు; పుట్టించిన దేవుడు పూరి మేపుతాడా? నా పెళ్లి కోసం సొమ్ము విషయమై నాలుగు చోట్లా ప్రయత్నిస్తూ ఉన్నాను. నాన్నగారు పెట్టుతూ

ఉన్న ఇబ్బంది నీకుకూడా కష్టం అనిపిస్తే నువ్వూ వెళ్ళిపోరా; ఇద్దరమూ ఉందాం.

కమ—అమ్మ చనిపోయిన తరువాత నాన్నగారు పెడుతూ ఉన్న ఇబ్బంది ఏగడియ కాగడియ ఎక్కువౌతూ ఉన్నమాటనిశ్చయమే; అయినా—

సుంద—అదిగో నాన్నగారి గొంతుక వినిపిస్తూ ఉంది. కొంత దూరంగాపోయి మాటాడుకొందాం; ఏలాగు నాన్నగారి రాతిగుండెను మెత్తపరచడానికి మనకు వీలవుతుందో అందుకు తగిన సాధనా లాలోచింతాం.

[సుందరం, కమల, నిష్క్రమింతురు.]

---

2 రంగము—[ధనదాసు, రామన్న ప్రవేశింతురు.]

ధన— ఒకే రామన్నగా, దొంగముండాకొడుకా, నా ఇంట్లోనుంచి లేచిపొమ్మంటే పోక వటవట వాగుతూ మొద్దులాగు కదలవేం? వెధవా, మరినోరు మూసుక కాళ్లునడిపించు. లే, మరి లే, లే, లే, లే—

రామ—(తనలో) దెయ్యం గానీ పట్టిందా! కారం తిన్నకాకిలాగు ఏ మరుస్తున్నాడు! కర్కోటకుడంటే కర్కోటకుడుకాడు. ముసలితనాన్ని కొస వెర్రెత్తుతుంది కాబోలు!

ధన— ఏమిటి, నోటిలో అలాగు గొణుగుకొంటూ ఉన్నావు?

రామ—బాబూ, ధనదాసుగారూ, నాకు తెలియకడుగుతున్నాను: నన్నెందుకీలాగు తగిలేస్తున్నారు?

ధన— తగిలేస్తానా? తగలేస్తానా? వెధవకి కారణాలు కావాలి? వెంటనే సైకిపోతావా? వీపు పెట్ల గొట్టమన్నావా?

రామ—బాబూ, నేనేం తప్పు చేశాను?

ధన— నా యెదుట ఉండడమే తప్పు; తెలిసిందా? పో, మరి పో.

రామ—మా యజమానుడు—

ధన— అదెవడు?

రామ—మీ అబ్బాయి, సుందరంగారు, నన్ను తనకోసం కనిపెట్టుకొని ఉండమని చెప్పి వెళ్లారు.

ధన— అయితే వీధిలోకి వెళ్లి అక్కడ వాడి కోసం కనిపెట్టుకొని ఉండు; అంతేకాని నా ఇంటిలో వద్దు. లే, మరి లే; పో, మరి పో. మొద్దులాగు కదలక నిలబడి ఎక్కడేం జరుగుతుందో కనిపెడుతూ ఉన్నావా? తరవాత దొంగతనం చెయ్యడానికా? నేను చేస్తూ ఉన్న ప్రతీపని దొంగతనంగా కనిపెట్టే దొంగవెధవను నేనింటిలో పెట్టుకొంటానా? దొంగవెధవ కళ్లన్నీ నేనెటు తిరిగితే అటే. ఏమూల నేముందో గుర్తుపెట్టడానికి కాక పోతే ఆదొంగచూపు లెందుకు?

రామ—మీ దగ్గిర దొంగతనం చెయ్యడమే? రేచుక్కా- పగటిచుక్కా- అంటూ కథలలో చెప్పుతారే, అలాంటి గజదొంగలు దిగివచ్చినా, వట్టిది. పుల్లతికపుల్ల కూడా భోషాణంలో పెట్టి కప్పతాళం వేసి దానిమీద నేబిచానా పరిచి కావలా పడుకుంటారు !

ధన— నా ఇష్టం వచ్చిందెల్లా భోషాణంలో పెట్టి తాళం వేస్తాను; నాఇష్టం వచ్చిన చోట బిచానా పరిచి కావలా పడుకుంటాను. ప్రతి సంగతి కనిపెట్టుతూ వున్న దొంగవెధవవు కాకపోతే, ఏంచేస్తానో, ఎక్కడ పడుకుంటానో ఏలాగు తెలిసింది? (తనలో) భగవంతుడా, తోటలో నేనిప్పుడు సొమ్ముదాచి పెట్టిన సంగతివీడుచూడలేదుగదా? (ప్రకా) భోషాణం తాళం వేస్తానే? నీ వీపుమీద వెయ్యాలి కాబోలు లేకపోతే! తాళం వెయ్యక తస్కరణానికి సులువు చేసి పెట్టుమన్నావా?

ఇంతకూ భోషాణంలో ఉన్నది గుడ్డా గుడుసే గదూ వెధవా; నేనింటిలో సొమ్ము దాచిపెట్టి ఉంస్తానని నువ్వు లేని పోని కథలు కల్పన చేసి అందరితోనూ చెప్పుతూ ఉంటావు గదూ?

రామ—అయితే మీరు ఇంటిలో సొమ్ము దాచిపెట్టి ఉంచారా, ఏమిటి?

ధన— వెధవా, అది కాదోయి నేనన్నది. హాస్యానికి నువ్వీలాటిమాటలు పుట్టించావేమో అని యడిగాను.

రామ—మీ దగ్గిర సొమ్ముంటే ఏం? లేకపోతే ఏం? అది మాకేమైనా రానా?

ధన— ఆఁ, ఆఁ, నాతో మాటకు మాట చెప్పుతూ వాదిస్తావా? నీకు సబబలు కావాలా? ఇవిగో, నీ వీపు మీద గుబగుబలు. (గుద్దును) వెధవా, ఇంటిలోనుంచి ఇక నడు.

రామ—సరే, ఈలాగే కదూ బాదుతారు. కానియ్యండి ఆలాగే వెళ్తున్నాను.

ధన— వెధవాయీ, ఆగవోయి; ఆ తొందరెందుకు? నువ్వేమీ తీసుకు పోవడం లేదుగదా?

రామ—ఏమిటి తీసుకు పోగలను, నా ఎముకలు?

ధన— తిన్నగా చెప్పకపోతే అవికూడా విరగగలవు? ఏదీ, ఈలారా; నన్ను చూడనియ్యి, నీ చేతులు విప్పు.

రామ—(చేతులు విప్పి) ఇవిగో చూడండి; ఏ మున్నవి రేఖలు తప్ప?

ధన— నే నటకసూద దాచిన రేకలేనా? ఏవి వెధవా, ఎక్కడ దాచావు?

రామ—అవి కావండి, నాచేతిలో రేఖలు; ధనరేఖ లేదు గాని సంతానరేఖలు మహా ఉన్నవండి.

ధన— వెధవా, నీ సాముద్రికం ఇప్పుడెవరికి కావాలని వెలిగిస్తున్నావె? చేతి వేళ్లు అణిచి పెట్టావేం? ఎడమెడంగా వుంచు.

రామ—(అట్లు చేసి) ఇదిగోనండి. ఇక గోళ్ల ఇరుకులలో ఏమైనా దాచా నేమో చూస్తారా?

ధన—వెధవాయలంగారు; నోరు ముయ్యించండి. ఏదీ, పాగా గుడ్డ విప్పు.

రామ—యజమానుల ఎదుట పాగా విప్పడానికి నేనంత మూర్ఖుడనను కున్నారా?

ధన—ఓ! నీ గౌరవం ఏడిసినట్టే ఉంది. పాగాలో ఏదో దాచి పారిపోవ డానికి ఇవన్నీ దొంగెత్తులు. పాగా విప్పుతావా? బాగా చిదక గొట్టమన్నావా?

రామ—మీరే విప్పుకోండి, నేనేం అడ్డానా?

ధన—(పాగా చుట్లు విప్పుచు) అబ్బా, కొండవీటిచేంతాడంత పాగా లేక పోతే పంతులాంగానికి తక్కువ కాబోలు! ఏమైనా దొంగలాడి దాచ డానికి పనికి వస్తుందని ఇంతేసి గంగిరెద్దుపాగాలు కట్టుకుంటారు, నాకు తెలుసును.

రామ—(తనలో) ఇంత అనుమానం పడుతూ ఉన్నందుకు ఇతడి దగ్గిర ఏమైనా దొంగలాడ గలిగితే—

ధన—ఏమిటీ?

రామ—ఏమిటి?

ధన—ఏమిటి దొంగలాడడమంటున్నావు?

రామ—ఏమైనా దొంగలాడానేమో అని ప్రతి దగ్గిరా తడుముతూ ఉన్నా రనుకున్నాను.

ధన—తడుముతానా? తడిమి చూస్తానా? ఊరుకోక పోతే నువ్వా తడుముకో వలసి వస్తుంది, వీపు. ఏవీ, జేబులు చూపించు.

రామ—(తనలో) ఛీ, పీనారితనం ఉన్న దౌర్భాగ్యులు—

ధన—ఏమిటీ? ఏమిటన్నావు?

రామ—ఏమిటన్నాను ?
ధన—పీనారితనం ఉన్న దౌర్భాగ్యులంటూ ఏమో అనబోయావేమిటి ?
రామ—పీనారితనం ఉన్న దౌర్భాగ్యులు పుట్ట కూడదనబోయాను.
ధన—ఎవరి గురించి అలాగనబోయావు ?
రామ—పీనారితనం ఉన్న దౌర్భాగ్యుల గురించి.
ధన—పీనారితనం ఉన్న దౌర్భాగ్యులంటే ఎవరు ?
రామ—ఉన్నారులెండి, కాకికెంగిలిచెయ్యి దులపని కటిక ముండా కొడుకులు.
ధన—అంటే ఏమిటి నీ ఉద్దేశం?
రామ—ఏదో అన్నాను; మీకెందుకా ఘోషంతాను?
ధన—నా ఇష్టం; అడగాలని అడిగాను. చెప్తావా? చెప్పవా ?
రామ—మిమ్మల్ని గానీ అన్నాననుకుంటున్నారా ఏమిటి ?
ధన—నాకు తోచిందేమో నేననుకొంటున్నాను. ఇంతకు ముందటి కబురులన్నీ ఎవరినుద్దేశించన్నావు ?
రామ—ఎవరినుద్దేశించి? నా లోపలనున్న మనస్సునుద్దేశించా కబురులన్నాను.
ధన—నీపైనున్న వీపుకు మళ్లీ కబురంద గలదు సుమా, భద్రం!
రామ—అయితే పీనారి పెద్దమ్మలను తిట్టుకుంటే అడ్డుతారా ?
ధన—అడ్డదిడ్డంగా కుయ్యకుండా అడ్డుతారు.
రామ—నే నెవరినీ పేరెత్తి తిట్ట లేదు.
ధన—చాలు లే, ఇక చదువు చాలించు.
రామ—పుచ్చకాయలదొంగా అంటే భుజాలు తడుముకోవడ మెందుకు?
ధన—భుజాలు తడుముకోవడం కాదురా వెధవా, వీపు తడుముకోవడం. (చరచును.)

రామ—ఈ తట్లే నేను తీసుకుపోవాలి. ఇదిగోనండి రెండో జేబు; చూచు కోండి...సరా;

ధన—ఒరే, ఈ అల్లరంతా ఎందుకు? ఏదీ, ఇచ్చీ.

రామ—ఏమిటిచ్చేది?

ధన—నువ్వు దొంగలాడింది.

రామ—నేనేమీ దొంగలాడ లేదు.

ధన—నీ సత్యప్రమాణకంగా నేనా.

రామ—సత్య ప్రమాణకంగా నే.

ధన—వెధవా, అయితే ఇక పో, గంగలో పడడానికి.

రామ—ఆహా! ఏం న్యాయంగా ఉంది! దొంగలాడక పోయినందుకు శిక్షా?

ధన—ఒరే, దొంగలాడి చెప్పకుండా ఉంటే పాపం వస్తుంది సుమా! చేసిన పాపం చెప్పితేనే పోతుంది, ఆలోచించుకో.

(రామన్న నిష్క్రమించును.)

ధన—ఈ దొంగవెధవంటే నాకు ఒళ్లు భగ్గుమంటుంది; వీడి దొంగమొఖం చూసే సరికే నా కరకాలిమంటశిరసుకు లేస్తుంది. తోటలో నేను సొమ్ము దాచడం, వెధవ చూచాడేమో! దగ్గిరఒకక్కమారే ఎక్కువ మొత్తపు సొమ్ముపెట్టుకొని ఉండడంమహాకష్టం; ఉన్నసొమ్మంతా వడ్డీలకిచ్చుకున్న వాడే భాగ్యవంతుడు. వడ్డీ రాకుండా ఒక గడియైనా సొమ్ము దగ్గిర పెట్టుకోరాదు; ఆ ఖర్చుకర్చుకు కావలసిన సొమ్ముకంటే ఎక్కువ మొత్తం దగ్గిర ఉండకూడదు. ఈ ఇల్లెల్లా వెదికాను గాని దాచుకోవడానికి తగిన చోటు నాకెక్కడా కనిపించింది కాదు. భోషాణప్పెట్టెలన్న మాటే కాని వాటిలో పెట్టి భొత్తిగా లాభం లేదు: వాటి పనే మొట్టమొదట పట్టిస్తారు, దొంగలు.

(దూరమున సుందరం, కమల, ప్రవేశింతురు.)

ధన—అప్పుల వాళ్లు ఈ వేళ తెచ్చి ఇచ్చిన వెయ్యి రూపాయిలూ తోటలో పాతానన్న మాటేగాని నా మనస్సు బితుకు బితుకుమంటూనే ఉంది. వెయ్యి రూపాయిలంటే ఏం మజాఖా? (సుందరంను, కమలను, చూచి) అయ్యో! దేవుడా, ఇంకేముంది? నా గుట్టు బట్టబయలయింది. తొందరచేత వెనకా ముందూ చూడకుండా నేను గట్టిగా అనుకున్న మాటలన్నీ ఈ కుర్రనాగమ్మలిద్దరూ విన్నారు కాబోలు (సుందరంతోను, కమలతోను) ఏం? ఏం వచ్చారు?

సుంద—నాన్నగారూ, ఏమీ లేదు.

ధన—ఇక్కడ మీరెంత సేపై ఉన్నారు?

కమ—ఇప్పుడిప్పుడే వచ్చాం.

ధన—ఏమిటేమిటి విన్నారు?—

సుంద—ఏమిటండి వినడం?

ధన—మాటలు?—

సుంద—ఏం మాటలు? ఎవరన్న మాటలు? ఎవరి గురించి మాటలు;

ధన—ఇప్పుడు నాలో నేననుకొన్న మాటలు.

సుంద—మేమేమీ వినలేదు.

ధన—విన్నారు, మీరు విన్నారు; నేనెరుగుదును.

కమ—నాన్నగారూ, మీరు భయపడ వలసిన అవసరం లేదు. మేమొక మాటా విన లేదు.

ధన—అంతా కాక పోయినా కొంతయినా మీరు వినే ఉంటారు; మీ ముఖాల వల్లనే తెలుస్తూఉంది. నేననుకుంటూ ఉన్నది మరేమీ లేదు: ఈ కాలంలో సొమ్ము సంపాదించాలంటే ఎంతో కష్టం; ఒక

వెయ్యి రూపాయిలింటిలో ఉన్నవాడెంతో భాగ్యవంతుడు. ఇదే నేననుకొంటూ ఉన్నది.

సుంద—దగ్గిరసావస్తే మీ మాటలు వినిపిస్తవనే మేం దూరంగా ఉన్నాం.

ధన—మీకీ సంగతి ఎందుకు చెప్ప వలసి వచ్చిందంటే, కర్మం చాలక మీరు నా మాటలు సగం సగం విని, నా దగ్గిరే వెయ్యి రూపాయిలున్నట్టు నేననుకుంటూ ఉన్నానని మీరనుమానపడతారేమో అని నాకు భయం వేసింది.

సుంద—నాన్నగారూ, మీ వ్యవహారపు సంగతులతో జోక్యం కలిగించు కోవడం మా అభిప్రాయం కాదు.

ధన—దైవకటాక్షం వల్ల ఆ వెయ్యి రూపాయిలూ నాకుంటేనా—

సుంద—నాన్నగారూ, నేను విన్నదే నిజమైతే—

ధన—అప్పుడు నేను నిజంగా అదృష్టవంతుడనే.

సుంద—నాన్నగారూ, మీ దగ్గిర—

ధన—ఆహా ! నా దగ్గిర వెయ్యి రూపాయిలుంటే ఇక లేనిదేమిటి ?

సుంద—నాన్నగారూ, ఆ మాత్రం—

ధన—ఆ మాత్రం ఉంటే కోట్లున్నంత ఫలం.

సుంద—నాన్నగారూ, మీరు—

ధన— అంత సొమ్ముంటే, కరువుకాలమని ఇప్పుడేడుస్తూ ఉన్నట్టు అప్పు డేడవనక్కర లేదు.

సుంద—నాన్నగారూ, అలాగంటారేం? మీరేడవ వలసిన అవసరమేమిటి? మీకు స్థితిగతులలో ఏవిధమైన లోపమూ లేదని అందరికీ తెలిసిన హంశమే.

ధన—ఏమిటీ! ఏమేమన్నాడు? అలాటి మాటలు పుట్టించిన వాళ్లు పచ్చి

అబద్ధాల కోరులు; అవి పైకి చాటే వాళ్లు వట్టిపుండాకోరులు. నోటికి శుద్ధీ బుద్ధీ వద్దూ?

కమ—నాన్నగారూ, కోపపడకండి.

ధన— కోపపడతానా? పడిచూస్తానా? నా కడుపున పుట్టిన పిల్లలే నాకు శత్రువులై ఈలాటి లేనిపోనిమాటలు చాటుతుంటే, ఇక పైవాళ్లనన వలసినదేముంది?

సుంద—మీ స్థితిగతులకు లోపం లేదన్నవాళ్లు మీకు శత్రువులా?

ధన—అవును, శత్రువులే. నా గర్భంలో పుట్టిన మీరే ఆలాగంటే నా గర్భశత్రువులవుతారు. మీరీలాటి మాటలాడుతూ ఉండడం ఒకటి, ఏమో భాగ్యవంతులు లాగు సొమ్ము తగలబెట్టుతూ ఉండడం ఒకటి, ఈ రెండూ చూచి ఎప్పుడో మన ఇంట దొంగలు పడి, నేను బంగారు పిచ్చుక నన్న నమ్మకంతో నాగొంతుక కాస్తా నులిపేస్తారు.

సుంద—నాన్నగారూ, నేను సొమ్ము తగలబెట్టుతూ ఉన్నానన్నారు, ఏమిటా తగలబెట్టడం?

ధన— ఏమిటా? నువ్వు వీథిలోకి వెళ్లేటప్పుడు చేసే షోకు ఏరాజుకొడుకు చేస్తున్నాడు? వాసననూనెలట! సెంటుబుడ్లట! టాయిలెట్టు సబ్బులట! ఎందుకో? ఒంటి మన్ను బీరకాయ పీచుతో పోయినట్టు ఏ సబ్బుతో పోతుంది? ఆ పైని నువ్వు కట్టుకొంటున్న బట్టలో? ఒక మల్లు పంచెలేమిటి? ఒక సేలం వోణీలేమిటి? ఒక జేబురుమామిటి? ఒక ఫెల్టుకేపులేమిటి? కట్టుకోవడానికొక ముతక గావంచా, కప్పుకోవడానికొక ముతక గావంచా, చాలవూ? వీటి మన్నిక ఆ మల్లుపంచెలకూ నల్లపంచెలకూ చస్తే వస్తుందా? నిన్న నిన్నే మీ చెల్లెలిని కోపపడ్డాను, పైటగాగరాలూ పింజలరవికెలూ మానమని. నీ సొగసు ఆడవాళ్ల సొగసుకంటె కూడా మించిపోతూ

ఉంది. నీ మెరుగులు సానిదానికైనా ఉండవు. ఏం పాపిట దిద్దు:లు! ఏం మొగం రుద్దులు! మేమెరగం బాబూ ఈ పద్దులు! నీ దుస్తులు ఒక కుటుంబానికాస్తి. నీ షోకు నాకు షోకని లకుమారులైనా చెప్పాను. నువ్వేం మహారాజుకొడుకువా, ఇంత షోకు కావాలనడానికి? నన్ను చెడమాపుతున్నావు; నా ఇల్లు గుల్ల చేస్తున్నావు.

సుంద—మీ ఇల్లు గుల్ల చేస్తున్నానా? అదేలాగు?

ధన— ఏలాగో నాకేం తెలుసును? గుల్ల చెయ్యక పోతే, నీ షాను షోకులన్నిటికీ సొమ్మెక్కడనుంచి వస్తూ ఉంది?

సుంద—సొమ్మా? నేను పేకాట ఆడి గెలుస్తూ ఉంటాను. ఆ గెలుపు సొమ్మే బట్టల కర్చుకి పనికి వస్తూ ఉంటుంది.

ధన—ఏం దూబర! నువ్వు పేకాటలో గెలిచినప్పుడు ఆగెలుపు సొమ్ము పొదుపు చేసి వడ్డీకి వెయ్యాలి. ఆలాగైతే, అది నీకు తరవాతకుపయోగిస్తుంది. మాట వరసకడగుతూ ఉన్నాను; గొంతుకకురిపోసుకొన్నట్టు ఈ నెక్టైై ఎందుకు, డబ్బిచ్చి తద్దినం కొనితెచ్చుకోవడంగాని? ఈలాగు దూబరగా డబ్బు తగలబెట్టుకొని ఆపైని ఘోరకార్యాలకు దిగితే, అప్పుడు గవర్నమెంటువారే ఉచితంగా నెక్టై తగిలిస్తారు. ఆ పైని ఈ కాలరెందుకు? ఇది లేకపోతే కంసాలికోసంలాగు మెడ నిలవదా ఏమిటి? వట్టి నెక్టైలూ కాలర్లకే, నీకు ఏటికి పాతిక రూపాయిల కంటే తక్కువ పడడం లేదు. నూటికి నెలకు రెండు రూపాయిల వడ్డీ చొప్పున పాతికకూ ఏటికి ఆరు రూపాయిల వడ్డీ వస్తుంది. వడ్డీకి వడ్డీ కట్టితే అయిదేళ్లకెల్లా, అసలసలు లాగుండగా వడ్డీ నలభై ఎనిమిది రూపాయిల మూడణాల తొమ్మిదిపైసల ఒకటోళీకి కొంచెం ఎక్కువే వస్తుంది.

సుంద—లెక్క కట్టినట్టు చెప్పారే.

ధన— ఇక ఈ ప్రసంగం చాలించి ఇంకొక సంగతి గురించి మాటలాడదాం.

(సుందరం, కమల ఒకరికొకరు సంజ్ఞలు చేసికొందురు.)

ధన— (తనలో) నా జేబులు ఖాడిమి ఏమైనా ఉంటే దొంగలాడడానికి కాబోలు వీళ్లు సంజ్ఞలు చేసుకుంటున్నారు! (ప్రకాశముగా) ఏమి టా సంజ్ఞలు?

కమ—మాలో ఎవరు మీతో మొదట మాటాడడమో తెలియక తటపటా యిస్తున్నాం; ఇద్దరమూ మాటాడ వలసే ఉంది.

ధన— నేను కూడా మా ఇద్దరితోనూ ఒక సంగతి చెప్ప వలసే ఉంది.

సుంద—నాన్నగారూ, మేం మీతో వివాహం విషయమై మాటలాడాలను కుంటున్నాం.

ధన—నేనూ మీతో వివాహం విషయమయ్యే మాటలాడాలనుకుంటున్నాను.

కమ—ఆ—

ధన—అదేమిటమ్మాయి, అలాగన్నావు? వివాహమన్న మాట వినడానికి భయమా? వివాహానికే భయమా?

సుంద—వివాహమంటే మేం భయపడేదీ లేనిదీ మీలోనే ఉంటుంది. మాకు ఇష్టం కాని సంబంధం ఏదైనా—

ధన—ఆ భయం మీకు వద్దు. ఏం చేస్తే మీ ఇద్దరికీ మేలో నాకు తెలుసును. నేను చెయ్యడానికి నిశ్చయించినదేదీ మీకయిష్టమై ఉండదు. మొదటి నుంచీ మొదలు పెట్టి చెప్పుతాను, వినండి. అబ్బాయీ, మన పొరుగున కాపురం ఉన్న రాధనే చిన్నదానిని నువ్వెరుగుదువా?

సుంద—ఎరుగుదును.

ధన— అమ్మాయీ, నువ్వో?

కమ—నేనూ విన్నానా చిన్న దానిని గురించి.

ధన—అబ్బాయీ, మరిచెప్పు: ఆ పిల్ల నీకంటికేలాగు కనబడ్డది ?

సుంద—నాన్నగారూ, ఆమె మహాలక్షణమైన పిల్ల.

ధన—మొఖం ఏలాగుంది?

సుంద—ఎప్పుడూ నవ్వుతూ కలకలలాడుతూ ఉంటుంది.

ధన—గుణం ఏలాటిదనిపించింది?

సుంద—వినయం, శాంతం, పాతివ్రత్యం, ఆచిన్నదాని మొగాన్న తాండవిస్తూ ఉన్నవి.

ధన—ఆలాటి పిల్ల సంబంధానికి తగినదేనా?

సుంద—తప్పకుండా తగినదే.

ధన—ఎవరైనా కోరుకో తగ్గ భార్యేనా?

సుంద—అందుకు సందేహ మెందుకు?

ధన—సంసారం పొదుపుగా, క్లుప్తంగా వాడుకొనే ఇల్లాలే అవుతుందా?

సుంద—తప్పకుండా అవుతుంది.

ధన—ఆలాటి భార్యను వివాహం చేసుకొనే వాడి సౌఖ్యానికి లోటంటూ ఉంటుందా?

సుంద—సుతలామూ ఉండదు.

ధన—అయితే ఒక్క చిక్కు మాత్రం ఉంది: కొంచెమూ ఆస్తిపాస్తీ లేనిపిల్లకదా, ఏలాగు పెళ్లి చేసుకోవడం?

సుంద—ఇన్ని లక్షణాలున్న ఇల్లాలు దొరుకుతూ ఉన్నప్పుడు, ఆస్తి కోసం ఎవరు చూస్తారు? ఆ చిన్నదాని సత్ప్రవర్తన కంటే ఆస్తేమిటి?

ధన—అదేమన్న మాట ? తగిన కట్నం కానుకా దొరకక పోతే అందుకు బదులీగా ఏమైనా పిల్ల తరఫువారినుంచి రాబట్ట వలసి ఉంటుంది.

సుంద—తప్పకుండా రాబట్టండి.

ధన—అబ్బాయీ, ఈ విషయంలో అన్నీ నాకు తోచినట్టే నీకూ తోచడం బహు సంతోషంగా ఉంది. ఆచిన్నదాని వినయమూ, శాంతమూ, పొదుపూ చూచి నామనస్సుకు ఇష్టం కలిగింది. తగిన కట్నం మాత్రం ఉంటే చాలు, తప్పకుండా పెళ్లి చేసుకుంటాను.

సుంద—ఏమిటీ?

ధన—ఏమి టేమిటి?

సుంద—మీరు తప్పకుండా ఏమిటీ చేసుకుంటానన్నారు?

ధన—ఏమిటికాదు, రాధను చేసుకుంటానన్నాను?

సుంద—ఎవరు? మీరా? మీరా?

ధన—అవును, నేను, నేను; నాకేత్వమిస్తే నే, నాకు కొమ్మిస్తే ను; నేను. ఇదేమిటి, ఈ వికారపు ప్రశ్నలన్నను?

సుంద—నాకు కొంచెం తల తిరుగుతూ ఉంది. పోయి, కొంచెం సేపు పడుక్కోవాలి.

ధన—గబగబ వంటింటిలోకి వెళ్లి ఒక చెంబుడు చల్లని మంచినీళ్లు తాగు. చల్లనీళ్లు తలనొప్పికి దివ్యౌషధం; సోడానీళ్లనీ నిమ్మనీళ్లనీ తాగితే నజ్జు చేస్తుంది.

(సుందరం నిష్క్రమించును.)

ధన—అదుగో, వెళ్తున్నాడండీ ఆడారి పెద్దమ్మ! బట్టలబండారమే కాని పట్టుమని పదినిమిషాలు నిలబడి ఉండలేదు; ఒకపూటలిండి మాని ఉండలేడు. అమ్మాయీ, ఇదీ నాకోసం కుదుర్చుకున్న సంబంధం. మీ అన్నకోసం కూడా ఒకసంబంధం చూచాను. మనలో మాను మనువులు చెల్లుతవి గదా? ఒక వెధవ మనిషి ఉంది, పాతికేళ్లది; మీ అన్నకంటే

అట్టే పెద్దది కాదు. ఆ మనిషిని మీ అన్నకు చేస్తాను. నిన్ను ముస
లయ్యగారికిస్తాను.

కమ—ముసలి ముసలయ్యగారికా?

ధన—అవును; ఆయన కాలం గడిపిన వాడు; అనుభవజ్ఞుడు; లేనిపోని పోకి
ళ్లకు పోని వాడు. ఆయనకింకా ఏభయ్యోపడి. సొమ్మా, సంచులతో
మూలుగుతూ ఉంది.

కమ—నాన్నగారూ, నన్ను క్షమించండి; నాకు పెళ్లి చేసుకోవాలని లేదు.

ధన—అమ్మాయిగారూ, నా ముద్దులమ్మాయిగారూ, నన్ను మీరు క్షమిం
చండి; మీకు పెళ్లి చెయ్యాలని నాకుంది.

కమ—నాన్నగారూ, నన్ను కటాక్షించండి.

ధన—అమ్మాయిగారూ, నన్ను కటాక్షించండి.

కమ—ముసలయ్యగారంటే నాకు చాలా గౌరవమే కాని, ఆయనను నేను
పెళ్లి మాత్రం ఆడను.

ధన—ముసలయ్యగారంటే నాకు చాలా గౌరవం కాబట్టి నిన్నాయనకు ఈ
రాత్రికే ప్రదానం చేస్తాను.

కమ—ఈ రాత్రికేనా?



ధన—ఈ రాత్రికే.

కమ—నాన్నగారూ, నావల్ల కాదు.

ధన—అమ్మాయిగారూ, మీవల్లనవుతుంది.

కమ—కాదు.

ధన—అవుతుంది.

కమ—కాదంటుంటే.

ధన—అవుతుందంటుంటే.

కమ—ఈలాటి విషయంలో మీరు నన్ను బలవంతెం పెట్టరు.

ధన—ఈలాటి విషయంలోనే తప్పకుండా బలవంతం పెడ్తారు.

కమ—నాగొంతుక కోసుకొంటాను గాని ఆలాంటి ముసలివాడిని ముడిపెట్టు కొంటానా?

ధన—గొంతుకా కోసుకోవు; ఆముసలివాడిని ముడీ పెట్టుకొంటావు.అన్నా! పెంకెతనం! నవ్వుతుంటే కొవ్వుతున్నావు. కూతురు తండ్రిని ధిక్కరించి ఈలాగు మాటలాడడం ఎక్కడైనా ఉందా?

కమ—తండ్రి కూతురికి ఈలాటి సంబంధం కుదర్చడం మాత్రం ఎక్కడైనా ఉందా?

ధన—ఈ సంబంధానికి వచ్చిన వంకేమిటి? ఎవరైనా వింటే బంగారురాజు లాటి సంబంధం అంటారు.

కమ—ఈ సంబంధానికి లేని వంకేమిటి? ఎవరైనా వింటే కాకిముక్కుకు దొండపండు కట్టబోయినట్టుందంటారు.

ధన—అదుగో, నా గుమస్తా బలరాం వస్తున్నాడు. అతడిని మధ్యవర్తి చేసుకొని తగువు తీర్చుకుందాం.

కమ—నా అభ్యంతరమేమీ లేదు.

ధన—అతడేలాగు తగవు చెప్పితే ఆలాగొప్పుకుంటావా?

కమ—ఓ, ఆయనకేది న్యాయమని తోస్తుందో అది నేనొప్పుకుంటాను.

ధన—సరే.

(బలరాం ప్రవేశించును.)

ధన—ఓయీ బలరాం, మా తగవు తీర్చడానికి నిన్ను మధ్యవర్తిగా ఏర్పర్చుకొన్నాం. నేను చెప్పింది న్యాయంగా ఉందా? అమ్మాయి చెప్పింది న్యాయంగా ఉందా?

బల—తప్పకుండా మీరు చెప్పిందే న్యాయం.

కమ—మేం ఏందు విషయమై మాటలాడుతున్నామో మీకు కొంచెమైనా తెలుసునా ?

బల—లేదు గాని నాన్నగారు చెప్పిన దానిలో అన్యాయం కూడానా? నాన్నగారు కేవలం న్యాయమూర్తులే.

ధన—తగువేమిటో చెప్తాను విను, బలరాం. ఈరాత్రి దీనికి ప్రధానం చెయ్యాలని నిశ్చయించాను. నేనెంచిన వరుడు చాలామంచివాడూ, చాలాగొప్పవాడూను; కంచికి వెళ్ళినా అంతకంటే మంచి మొగుడు దొరకడు. అలాంటి మొగుడు దొరుకుతూ ఉంటే చంకలు గుద్దుకోవడానికి బదులు నాకు వద్దో అంటూ కూర్చుంది ఈ బుద్ధి లేని మొద్దు పిల్ల! నువ్వేమంటావు?

బల—నేనేమంటానా?

ధన—అవును.

బల—ఏమా? ఏమా ?

ధన—అవును, చెప్పు.

బల—సంగతిసందర్భాలన్నీ ఆలోచిస్తే మీఅభిప్రాయమే నా అభిప్రాయం. మీరన్నదానిలో పొరపాటుండడానికి వీలులేదు. అయినా అమ్మాయి చెప్పేవదిన్నీ బొత్తిగా పొరపాటని కొట్టివెయ్యలేం.

ధన—అదేలాగు? ముసలయ్యగారి సంబంధం మహాగొప్ప సంబంధం. ఆయన గొప్పింటి వాడు; పెద్దింటి వాడు. లక్షాధికారి; కోటీశ్వరుడు. పోకిరీతనం లేదు. మొదటిభార్య తాలూకు పిల్లలు లేరు. ఇంతకంటే మంచి సంబంధం తలకిందులా తపస్సు చేసినా దొరుకుతుందా?

బల—నిశ్చయం. అయినా అమ్మాయి ఏం చెప్పవచ్చునంటే, మీరు బొత్తిగా తొందరపడుతున్నారనిన్నీ, ఈ సంబంధం తనకిష్టమయే వరకూ కొంచెమైనా మీరు వ్యవధి ఇయ్య వలసి ఉంటుందనిన్నీ—

ధన—వ్యవధియ్యడం ఏలాగు? ఈ సంబంధం కాస్తా తప్పిపోతే ఇక చేతులు కాలిన తరవాత ఆకులకు దేవులాడినట్టుంటుంది. మరి ఏచోటా కలగని లాభం నాకొకటి దీనిలో కలుగుతూ ఉంది. కట్నం లేకుండా అయిన పిల్లదానిని పెళ్లి చేసుకోవడానికొప్పుకున్నాడు.

బల—కట్నం లేకుండానా?

ధన—అవును, కట్నం లేకుండా.

బల—అయితే మరి నేను నోరెత్త లేను. అంతకంటే మరి ముఖ్యమైన హంశమే లేదు. ఆ ఒక్క కారణానికే అమ్మాయి తప్పకుండా ఒప్పుకోవలసిఉంటుంది.

ధన—అందువల్ల నాకెంత సొమ్ము మిగులుతుంది?

బల—అందుకు సందేహమేమిటి? ఈలాంటి తిరుగులేని కారణముంటూ ఉండగా, ఇక కాదనడానికి ఎవరికి నోరు వస్తుంది? ఒకవేళ మాట వరసకు అమ్మాయి ఈలాగంటే అనవచ్చును: ఏమిటంటే, వివాహమంటే కాయగూరల బేరంకాదు; వధూవరుల యావజ్జన్మసౌఖ్యమూ చూచి చెయ్యవలసి ఉంటుంది; ఇంత ముఖ్యమైన విషయంలో సాధక బాధకాలన్నీ చూచుకోకుండా తల్లిదండ్రులు తొందరపడడం న్యాయంకాదు—

ధన—కట్నం లేకుండానే?

బల—కట్నం లేకుండానే కాబట్టి ఆ సంగతు లెత్తుకోనే అక్కరలేదు. అయితే కొంతకొంతమంది ఏమంటారంటే, ఈలాంటి విషయాలలో కూతురు మనస్సు కూడా కొంచెం కనిపెట్ట వలసిన బాధ్యత తండ్రికుంటుందనిన్నీ, వధూవరులకు వయస్సులో విస్తారం తేడా ఉంటే అలాంటి వివాహం నానా అనర్థాలకూ మూలమవుతుందనిన్నీ—

ధన—కట్నం లేకుండానే?

బల—కట్నం లేకుండానే కాబట్టి ఆ మాటలేమీ అనడానికి వీలులేదు. కట్నం లేకుండానే! అలాటి కారణం ఎవరు తోసివెయ్యగలరు?

ధన—(తనలో) ఆహా! తోటలో కుక్కరుస్తున్నట్టుంది. సొమ్ముకోసం దొంగలు వచ్చారేమో! (ప్రకాశముగా) బలరాం, ఇదిగో ఇప్పుడే వస్తాను; వెళ్లిపోకు.

(ధనదాసు నిష్క్రమించును.)

కమ—మీరు మా నాన్నగారితో అన్న మాటలన్నీ మీ మనసారా ఆడిన మాటలేనా?

బల—మనసారా ఆడినవి కావు, నాలుకారా ఆడినవి. ఇన్ని దొంగమాటలాడడంచేత నిజంగా నాలుకారే పోతూ ఉంది. మీ నాన్నగారు నందంటే నందంటూ పందంటేపందంటూ ఉంటే తప్ప ఆయనకు చిరాకుపుట్టి నా మీద కోపం తెచ్చుకుంటారు; ఆ మీద మరి టోపీ పడదు. మీ నాన్నగారు చెప్పిన దానికి విరుద్ధంగా వాదిస్తూ కూరుచున్నామంటే కార్యం మొదటికే వికటిస్తుంది. కొంతమంది మనుష్యులు ఉన్న మాటంటే ఉలికిపడుతూ తిన్నటి దారిలోకి ఎప్పటికీ రారు. వాళ్లవున్నదానిని కాదని ఆ తరవాత చూడాలి వాళ్లతమాషా! కళ్లెం గానీ నోట్లో పెట్టబోతే గుర్రం ఏలాగు చేస్తుందో అలాగు గింజుకొంటారు, తన్నుకొంటారు, కరవబోతారు, పైకి లేవబోతారు; అంతే గాని తిన్నటి రస్తాలోకి రారు. అలాటి వాళ్లను తట్టి తారీఫు చెయ్యడానికొకటే పద్ధతి: వాళ్లవున్నది కాదనకపోవడమే. అందుచేతే "కట్నంలేకుండా" అని నేను మాటిమాటికీ ముక్తాయించ వలసి వచ్చింది.

కమ—అయితే ఈ ప్రధానం గురించి ఏమంటారు?

బల—ఇది తప్పించడానికేదో సాధనోపాయం వెదుకుదాం

కమ—రాత్రికే జరగనై ఉన్నదానికేం సాధనోపాయం?

బల—ప్రస్తుతం మట్టుకు ప్రధానమాగడానికి కడుపునొప్పో కాలునొప్పో తెచ్చుకో.

కమ—వైద్యుడిని పిలిస్తే టక్కుని పోల్చుకొంటాడే?

బల—ఆ భయం అక్కర లేదు. రోగం అంటే ఏమిటో వైద్యులకు తెలుసు ననుకొన్నావా ఏం?వట్టిమాట. ఇదిగో, చెప్పతాను: ఇది వేదవాక్యంగా నమ్ము. నీ ఇష్టంవచ్చిన రోగం అని నువ్వు బొంకు; వెంటనే, ఆ రోగం ఎందుకు వచ్చిందో కావలసినన్ని కారణాలు వైద్యులు శ్లోకాలతో కూడా ఏకరువుపెట్టి చెప్పతారు.

(దూరమున ధనదాసు ప్రవేశించును.)

ధన—(తనలో) వట్టి భయమే పడ్డాను. సొమ్మక్కడే ఉంది.

బల—ప్రధానం తప్పించడమే ప్రధానమైతే ఆలాటి టక్కు. లేదు, నామీద నీకు మోహం పూర్తిగా ఉండీ నన్ను కృతార్థుడినే చెయ్యదలిస్తే ఈ సాయంకాలమే మనం చాటుగా పెళ్లి చేసుకొందాం. అందుకు తగిన బందోబస్తులన్నీ చెయ్యగలను. ముహూర్తం కూడా ఉంది. శుభస్య శీఘ్రమన్నాడు. కమలా, కమలవదనా, కమలనయనా,—(ధనదాసును చూచి) తెలిసిందా? కమలా, నాయనగారి మాట వినడం కూతురికి విధి. తండ్రి కుదిర్చిన మొగుడు ఏలాటివాడని అడగడానికైనా కూతురికి అధికారం లేదు. కట్నం లేకుండా కార్యం జరిగేటంత ముఖ్యమైన లాభం కలుగుతూ ఉన్నప్పడు పెళ్లికొడుకు ముసలివాడు కానీ, ముతకవాడు కానీ, కుంటివాడు కానీ, గుడ్డివాడు కానీ, చెడుగువాడు కానీ, సెబ్బరవాడు కానీ, ఆడపిల్ల ఒప్పకోవలసే ఉంటుంది.

ధన—ఆహా! ఎంత చక్కగా చెప్పావు!

బల—ధనదాసుగారూ, మీ స్థానే అమ్మాయిని నేను కొంచెం కూకలు వేస్తున్నాను; క్షమించండే.

ధన—నాకేమీ కోపంలేదు. ఇంకా సంతోషంగా ఉంది. దానిని నీదగ్గిర కూర్చోపెట్టుకొని తలవాచేటట్టు చీవాట్లుపెట్టు. కమలా, వింటున్నావా? కావలిస్తే చాటుగా ఎవరినైనా ముడిపెట్టుకొంటావేమో ముడిపెట్టుకో, చూదాం. నీ మీద నాకున్న అధికారమంతా ఈ బలరాంకు నేనిచ్చివేశాను. ఆతడు చెప్పినట్లెల్లా విను.

బల—అమ్మాయీ, వారాలాగు చెప్పిన తరవాత ఇక నేనేం చెప్పినా నువ్వు వినక తీరదు గదా?

(కమల నిష్క్రమించును.)

బల—అయ్యా ధనదాసుగారూ, నేనూ అమ్మాయి వెంట వెళ్లి ఆమె మనస్సుని కొంచెం విరచడానికి ప్రయత్నిస్తాను.

ధన—వెళ్లు, తప్పకుండా వెళ్లు; నువ్వు నాకెంతో మేలుచేసినట్టు తలస్తాను.

బల—అమ్మాయిని కొంచెం నొక్కిపెట్టే ఉంచాలి; లేకపోతే శ్రుతి మించి రాగాన్ని పడుతుంది.

ధన—నీ ఇష్టం వచ్చినట్లెల్లా చెయ్యి. ఏలాగు తిప్పకుంటావో, నీదే భారం.

బల—మీరేమీ చింతపెట్టుకోకండి. నేను నయభయాలా ఏలాగో వశపరుచుకొంటాను. రాత్రి ప్రధానానికే కాదు; సాయంకాలం వెళ్లికే ఒప్పిస్తాను.

ధన—కానీ, మరివెళ్లు. ఇంతలో ఒక్కమారు నేను ఊళ్లోకి వెళ్లి వస్తాను.

బల—(కమల వెళ్లిన వైపు వెళ్లి ధనదాసు వినునట్లు గట్టిగా) అమ్మాయీ, వింటున్నావా? లోకంలో ధనం లాటిది మరొకటి లేదు. ధనం

మూలం ఇదం జగత్తని అందుకే అంటారు. ధనం విలువ తెలిసిన దయ గల తండ్రి నీకు దొరకడం నీ పురాకృతవిశేషం. లోకమంటే ఆయనకు తెలిసినట్టు మరొకరికి తెలియదు. కట్నం లేకుండా పెళ్లాడుతానని సంబంధం వచ్చినప్పుడు, ఆపైని మరే లాభం కోసమూ చూడ కూడదు. అన్ని లాభాలూ దానిలోనే ఇమిడి ఉన్నవి. రూపంలేక పోయినా, ఈడెక్కువైనా, కులం తక్కువైనా, మర్యాద లోపమైనా, తెలివి శూన్యమైనా సరే. "కట్నం లేకుండా" అన్న ఒక్క ముక్క ఇన్ని లోపాలనూ కప్పుతుంది. (నిష్క్రమించును.)

ధన—ఆహా! ఇవి కేవలమూ దివ్యవాక్కులే. ఈలాటి సేవకుడు దొరికిన వాడిదే అదృష్టం. (నిష్క్రమించును.)

---

# II అంకము.

---

I రంగము—(సుందరం, రామన్న, ప్రవేశింతురు.)

సుంద—ఒరేవు రామన్నా, దొంగవెధవా, ఇలా రా. ఇంత సేపూ ఎక్కడ దాగుడుమూతలాడుతున్నావు? నేను నీతో ఏమని చెప్పాను? నువ్వేం చేశావు?

రామ—సుందరం బాబూ, నా తప్పేమీ లేదు. మీరు చెప్పినట్టు మీకోసం లోపటే కనిపెట్టుకొని ఉండగా, మీ నాన్న గారు అగ్గిరాముడు లాగు వచ్చి రెండు గలీతాలిచ్చి నన్ను మెడ పట్టుకొని పైకి గెంటారు. లోపట ఉన్నందుకు వారొక వాయింపు వాయించారా, లోపట లేనందుకు ఇక మీరు కానియ్యండి. అవును, దరువువెయ్యడానికి కాకపోతే నౌకరీవాళ్లకు వీపులుండి ఏం ప్రయోజనం?

సుంద—ఒరే, దానికేం గాని మన వ్యవహారం ఏలాగు నడుస్తూ ఉంది? అంతకంతకూ చిక్కులెక్కువౌతున్నవి. మా నాన్న గారే నాకు పోటీ తగులుతున్నట్టు ఇప్పుడే తెలిసింది.

రామ—ఏమిటీ? మీ నాన్న గారికి నిజంగా మోహమేనా? ధనదాసుగారికే మోహమా?

సుంద—అవునురా, అలాగే కనిపిస్తూ ఉంది. ఈ సంగతి ఆయన ముఖతానే విన్నాను. అప్పుడు నాకు కలిగిన ఆశ్చర్యం పైకి కనబడకుండా ఇముడ్చుకోవడం ఎంతో కష్టమయిందిరా.

రామ—ఆయనేమిటి, మోహమేమిటి? మోహంతో ఆయనకేం సంబంధం? ఏమిటాయన ఉద్దేశం? ఎవరేమనుకుంటారోఅన్న భయమైనా అక్క—

ర లేదా ఏమిటి ఆయనకు? ఆయనలాంటి వాళ్లకూ మోహాలుంటాయి ఎక్కడి కెక్కడ?

సుంద—ఒరే రామన్నా, నా ప్రారబ్ధం కొద్దీ ఆయనకీ మోహం కలిగిందిరా.

రామ—అయితే సుందరం బాబూ, నాకు తెలియకడుగుతాను, గాని మీకా చిన్నదాని మీద మోహమున్నట్టు మీ నాన్నగారికి చెప్పేయ లేక పోయారా? ఎందుకీ ముసుకులో గుద్దులాట?

సుంద—ఒరే, నామోహం వెల్లడి చేసే పక్షానికి ఆయన జాగ్రత పడిపోయి మరి మన ఆటలు సాగనియ్యరు. ఈలాగు మాతముప్పిడిగా కాలక్షేపం చేస్తేనే మనకేదో అవకాశం చిక్క వచ్చును. అది ఆలాగుండనీ. నువ్వు వెళ్ళిన పనేమయింది? అప్పెక్కడైనా పుట్టిందా?

రామ—బాబూ, అప్పు చేసే వాళ్లకంటే దురదృష్టవంతులుండబోరు సుమండీ. అప్పులవాళ్ల చేతులలో పడ్డ వాళ్లూ యమదూతల చేతులలో పడ్డ వాళ్లూ ఒకటే నొస్తరు.

సుంద—అప్పు పుట్టిందా, లేదా?

రామ—ఎందుకు పుట్టదు? మనకు మధ్యవర్తిగా కుదురుకున్న కామయ్యసెట్టి ఉన్నాడే, అతడు మంచి చురుకైనవాడు, పట్టుదల గలవాడు; ఊరెల్లా గాలించి అప్పు పుట్టించాడు.

సుంద—నేను కోరిన వెయ్యిరూపాయిల అప్పూ దొరుకుతుందా?

రామ—దొరుకుతుందిగాని కొంచెం షరతులు మట్టుకున్నవి. వాటికి మీరొప్పుకుంటేనే వ్యవహారం పైసలు చేస్తారంట.

సుంద—మనకప్పిచ్చే అసలసామిని కలుసుకొని నువ్వు మాటలాడావా?

రామ—అబ్బెబ్బే! ఈలాంటి వ్యవహారాలు మధ్యవర్తి ద్వారా పరిష్కరించుకోవడమే గాని, అసలు మనుష్యులు అకరువరకూ పైకి రారు. అంత

వరకూ అంతా గుంభనగా జరగవలసిందే. మీ పేరు వెల్లడి కావడం మీ కెంత ఇష్టం లేదో, అంత కంటే ఇష్టం లేదు అతడికతడి పేరు వెల్లడి కావడం. షరతులన్నీ మీ రొప్పుకుంటే మిమ్మల్నీ అతడినీ ఈవేళ ముఖాముఖీ చెయ్యడం జరుగుతుందట. అప్పుడు మీరు మోతుబరులవుతో కారో మీనోటే అతడు వినడానికి వీలు కలుగుతుంది. మీ నాన్నగారి పేరు వినడమే తరవాయి గాని,ఆ ఉత్తరక్షణంలో ఎంత సొమ్ము బడితే అంత ఇస్తాడని నా నమ్మకం.

సుంద—మా అమ్మ చనిపోయింది కాబట్టి ఆవిడ ఆస్తిలో నాకు రావలసిన భాగం కూడా ఉంది. దాని అయివేజు చూచుకొనయినా ఇయ్యవచ్చును.

రామ—బాబూ, వ్యవహారం పరిష్కారం కాకముందు ఆ షరతులు మీకిష్టమవుతవో కావో కనుక్కోవాలని మధ్యవర్తి వాటిని రాసుక వచ్చాడు; వింటారా? చదువుతాను.

సుంద—చదువు.

రామ—"అప్పు పుచ్చుకుంటూ ఉన్న అసామికి మైనారిటీ దాటి ఉండవలెను. ముందుకతడికి హక్కుపడే ఆస్తి గొప్పదై ఉండవలెను; స్థిరాస్తి కావలెను; తంటాలూ తగనాలూ లేనిదై ఉండవలెను; ఇప్పటికి దానిమీద తణఖా ఏదీ ఉండ కూడదు. ఇవన్నీ సరీగా ఉన్నట్టు అప్పిచ్చే అసామీకి నమ్మకం కలిగితే, అప్పుడాయన కుదిర్చే తగు మనుష్యుల ఎదుట పత్రం రాయవలెను."

సుంద—ఇంత వరకూ న్యాయంగానే ఉంది.

రామ—"అప్పిచ్చే అసామీ అన్యాయపు సొమ్ము కాసపడే వాడు కాదు కాబట్టి నెలకు నూటికి రూపాయి వడ్డీకంటే ఎక్కువ పుచ్చుకోవడపు ఉద్దేశం లేదు."

సుంద—నూటికి రూపాయేనా? ఇది ధర్మవడ్డే. మనం ఏడవ వలసిన అవసరం ఏమీ లేదు.

రామ—నిజమే. పైనివినండి: "అయితే ఈ అప్పిచ్చే అసామీ దగ్గిర ప్రస్తుతం పైకం లేక పోవడంచేత వేరే చోట నూటికి నెలకు మూడు రూపాయిల వడ్డీ చొప్పున అప్పు తేవలసి వచ్చింది. ఆ వడ్డీ కూడా మీాద చెప్పిన రూపాయి వడ్డీతోనూ కలపడం న్యాయం గనక మొత్తం మీాద నెలకు నూటికి నాలుగు రూపాయిల చొప్పున వడ్డీ ఇయ్యవలెను."

సుంద—వహవ్వా! మంచి ధర్మవడ్డే! మారువాడీ వడ్డీని మించి పోతూ ఉందే.

రామ—నిజమే, నేనూ అదే అన్నాను. కాబట్టి మీారు ముందే లోతుపాతులు బాగా చూచుకొని మరీ వ్యవహారంలో కాలు పెట్టండి.

సుంద—ఏమిటి చూచుకొనేది? సొమ్ముంటే గాని కథ నడవదు. ఏం షరతులు కోరినా చచ్చినట్టొప్పుకో వలసిందే.

రామ—ఈలాగనే నేనూ అన్నాను.

సుంద—ఇంకా ఏవైనా షరతులున్నవా?

రామ—ఇంకొక చిన్న షరతుంది, వినండి: "కావలసిన వెయ్యి రూపాయిలలో ఆరు వందల రూపాయిలు మాత్రమే కుదిరినవి. తక్కిన నాలుగు వందల మింజుమలే ఈ దిగువ ఉదహరించిన జాబితాలోని సామానులు పుచ్చుకో వలసి ఉంటుంది. ఆ సామానులకు బజారు ధరల కంటే చాలా తక్కువ ధరలు వెయ్యడమయినది."

సుంద—ఈ ఘోషంతా ఏమిటి?

రామ—ఇదిగో జాబితా చదువుతాను, వినండి: ఒకటో పద్దు—టేకు కర్ర పందిరిమాలు పట్టె మంచం; తూలుగుడ్డ టాపు; దోమ తెర;

నాలుగొత్తు రాళ్లు. రెండో పద్దు—కేన్వాసు గుడ్డ వేసిన నాలుగు మడత కుర్చీలు; బెత్తపల్లిక అల్లిన రెండు పెద్ద కుర్చీలు, చేతులున్నవి; అయిదు బెంటువుడ్డు కుర్చీలు."

సుంద—ఈ చెత్తంతా నన్నేం చేసుకోమంటాడు? నాకు రిమ్మెత్తకొంటూ వస్తుంది.

రామ—ఇంకా వినండి: "మూడో పద్దు – రవివర్మ బొమ్మలు, పెద్ద సైజువి, మోహిని; గంగావతరణం; విశ్వామిత్ర మేనక; అద్దాలు బద్దలయినవి గాని చట్టాలు దిట్టంగానే ఉన్నవి. నాలుగో పద్దు—పెద్ద రాతబల్ల, మారుజాతి కర్రది, నాలుగు సొరుగులున్నవి."

సుంద—ఆహాహా! ఇవన్నీ నా నెత్తి మీద పెట్టుకొని నేనేం చేసేది?

రామ—ఇక కొంచెం ఓపిక పెట్టి వినండి: అయిదో పద్దు—పెద్ద అద్దాల బీరువా, ఆరరలున్నది. ఆరోపద్దు—జోడుగుళ్ల బారు తుపాకీఒకటి."

సుంద—అది కూడా ఎందుకు? నా గుండెకెక్కు పెట్టుకొని కొట్టుకొమ్మనా? నాకు వెర్రెత్తుతూ ఉంది.

రామ—ఉండండి; కావచ్చింది. "ఏడో పద్దు—ఒక వీణ, దాదాపుగా అన్ని తీగెలూ ఉన్నది. ఎనిమిదో పద్దు—చదరంగపు బల్లా బలమూ; దంతంతో చెసినవి. తొమ్మిదో పద్దు—పులి చర్మం ఒకటీ, లేడి చర్మం ఒకటీ. పదో పద్దు—చూరకత్తి, దంతం పిడీ, వెండి కట్లూ, పట్టు ఒరా, వీటితో ఉన్నది."

సుంద—గొంతుక కోసుకోవడానికి కాబోలు! అయిందీ? చివరిని ముష్టి చెంబొకటి కలిపాడేమో చూడు.

రామ—"పై సామానులన్నిటికీ అసలు ధర అధమం ఆరు వందల రూపాయిలు అయినా చవక బారున నాలుగు వందలకు కొట్టి వెయ్యాడమయింది."

సుంద—మంచి చవక బారే! వీడి సిగా తరగా! చండాలుడు! దుర్మార్గుడు! ఎక్కడైనా ఇంత అన్యాయపు దోపుడుందా? నూటికి నెలకు

నాలుగేసి రూపాయిల వడ్డీ తెమ్మనడం చాలక, ఇంకా ఈ చెత్తం తో నాలుగు వందలకు నా నెత్తిని వేసి పులుముతాడా? అవన్నీ కలిపి అమాంబాపతులూ రెండువందలయినా చెయ్యవు. అయినా, ఏం చెయ్యను? దేవుడా అని ఒప్పుకో వలసిందే. వెధవ నా అవసరం చూచి ఆడలాడుతున్నాడు. శుద్ధక్షౌరం తప్ప మరేమీ తెలియదు కాబోలు మంగలివెధవకు!

రామ—బాబూ, కోపగించనంటే మనవి చేస్తాను: చిప్ప చేతికి రావడానికి తగిన ఏర్పాటులన్నీ చేసుకుంటూ ఉన్నారు; అప్పులు చెయ్యడం, ఎక్కువ ధరలకు కొనడం, తక్కువ ధరలకమ్మడం, నీటిలో గేదెను పెట్టి బేరం చెయ్యడం—

సుంద—నన్నేం చెయ్యమంటావు? తండ్రుల పీనాసితనానికేడుస్తూ కొడుకులనుభవించ వలసిన అవస్థే ఇది. తండ్రులెప్పుడు చస్తారా అని కొడుకులెదురు చూడడంలో ఇక వింతేముంది?

రామ—బాబూ, అది మాత్రం నిజం. మీ నాన్నగారి పిసినిగొట్టుతనం చూస్తే ఎంత మంచి వాళ్లకయినా చెడు కోర్కెలు పుట్టక మానవు. నా మట్టుకు నాకు ఎర్రపాగాలంటే ఎంతో భయం. నాతోడివాళ్లందరూ ఖైదులోకి వెళ్లడానికి తగిన మార్గాలు చూచుకుంటూఉంటే నేను మాత్రం ఆదారి తొక్కకుండా కబర్దారీగానే ఉంటాను. అలాటి వాడను నాకు కూడా మీ నాన్నగారి పిసినిగొట్టుతనాన్ని చూచినప్పుడెల్లా, వీలయితే ఆయన సొమ్మేమైనా దొంగలాడాలనే ఉంటుంది. చేస్తే మట్టుకు పాపంరాదు; పుణ్యమే వస్తుంది.

సుంద—ఏదీ, ఆ జాబితా ఈలాగు తే; మరొక్కమారు చూస్తాను.

(సుందరం, రామన్న నిష్క్రమింతురు.)

2 రంగము—(ధనదాసు, కామయ్యసెట్టి, ప్రవేశింతురు.)

---

కామ—అవునండీ, నేను చెప్పినచిన్నవాడికి సొమ్ము చాలా జరూరు. ఏకాడికైనా అతడికిప్పుడు కొంత సొమ్ము చేత పడితేనే కాని తీరదు. అందుచేత మీషరతులన్నిటికీ ఒప్పుకుంటాడు.

ధన—అయితే కామయ్యసెట్టిగారూ, మరొక్క మాటడుగుతున్నాను: ఈ వ్యవహారంలో మరేమీ తంటాలూ దావాలూ రావు గదా? మీరు చెప్తూ ఉన్న చిన్నవాడి పేరేమిటో, ఊరేమిటో, అతడి తండ్రెవరో, ఆస్తెంతో, మీకు తెలుసునా?

కామ—అవేవీ నిశ్చయంగా చెప్ప లేనని అప్పుడే మనవి చేసుకున్నాను కదూ? అతడికీ నాకూ నిన్న గాక మొన్న నే పరిచయం కలిగింది. అతడి ముఖతానే మీరన్నీ సంగతులూ తెలుసుకో వచ్చును. అతడెవరో మీకు బోధ పడ్డ తరవాత మీరేమీ అడు చెప్పరని అతడి నాకరు నాతో అన్నాడు. నేను చెప్ప గలిగినదెంతమటుకంటే, అతడు మంచి మోతుబరి కుటుంబంలో వాడు; అతడి తల్లి పోయింది; తండ్రి కూడా ఆ సరంజాములోనే ఉన్నాడు; ఆరేడు నెలల లోపుగానే పరమపదం వేంచేయిస్తాడట.

ధన—అలాగేం? చూచారా కామయ్య సెట్టిగారూ, పైవాళ్లు పాపం చిక్కులలో ఉన్నప్పుడు మన చేతనైన సహాయం చెయ్యడం మనకు విధి. "పరోపకారార్థమిదం శరీరం," మన్నాడు.

కామ—అవునండి.

(సుందరం, రామన్న, దూరమున ప్రవేశింతురు.)

రామ—ఇదేమిటండోయి సుందరం బాబూ, మన మధ్యవర్తి కామయ్యసెట్టి మీ నాన్నగారితో మాటలాడుతున్నాడు?

కామ—ఏమండోయి సుందరంగారూ, రండి; మంచిసమయానికే దయచేశారు. మేం ఇక్కడుంటామని మీకేలాగు తెలిసింది? అయ్యా ధనదాసుగారూ, మీ పేరూ ఊరూ వీళ్లతో నేను చెప్పావనుకో గలరు. ఆలాటిదేదీ జరగ లేదు. అయినా ఇప్పుడు వచ్చిన ఉపద్రవమేమీ లేదు. వీరు మంచినమ్మకమైన మనుష్యులు. మీరు మరే ఆలస్యం లేకుండా వ్యవహారం ఇప్పుడే పైసలు చేసుకో వచ్చును.

ధన—ఏమిటీ?—

కామ—ఇదిగోనండి, ఈ సుందరంగారికే వెయ్యి రూపాయిల అప్పు కావాలి.

ధన—ఏమిటి పోకిరీ వెధవా, నువ్వేనా ఈలాగు సొమ్ము తగలబెట్టుతూ ఉన్నవాడవు?

సుంద—ఏమిటి నాన్నగారూ, మీరేనా సిగ్గు లేక ఈలాటి వడ్డీ వ్యాపారాలు చేస్తున్నవాళ్లు?

(కామయ్యసెట్టి పారిపోవును. రామన్న మూలనక్కి దాగుండును.)

ధన—ఈ లాటి పాడప్పులు చేసి పాడవుతూ ఉన్న పాడగట్టవు నువ్వేనటోయి?

సుంద—ఈ లాటి అడ్డదిడ్డపు వడ్డీలకాసపడ్డ దొడ్డవారు మీరేనటండీ?

ధన—ఇక నాకు ముఖం చూపించడానికి నీకు సిగ్గులేదూ?

సుంద—ఇక నాకు ముఖం చూపించడానికి మీకు సిగ్గులేదూ?

ధన—ఈ లాటి దుబారా ఖర్చులు చేస్తూ, సొమ్మంతా తగలబెట్టుతూ, తల్లిదండ్రులు చెమటూడ్చి పోగుచేసిన ఆస్తి ఎగిరించి వేయడానికి తయారు పడుతూ ఉన్నావు గదా, ఎవరైనా వింటే ఏమంటారు?

సుంద—ఈ లాటి అన్యాయవ్యాపారాలు చేస్తూ, దమ్మిడీ కోసం అడ్డమాని గడ్డీ కరుస్తూ, ఏ మారువాడీలూ ఎరగని ఎక్కువ వడ్డీ పుచ్చుకొని సంసారుల కొంపలు మాపుతూ, రవ్వా రట్టూ లేని మన కుటుంబపు పేరూ ప్రతిష్ఠా పాడుచేసి నట్టేటిలో కలుపుతూ ఉన్నారు గదా, ఎవరైనా వింటే ఏమంటారు?

ధన—ఛీ, పోకిరీ నాగమ్మా, పో, నా ఎదుటనుంచి లేచి పో.

సుంద—నాన్నగారూ, సొమ్మవసరముండి ఎక్కువ వడ్డీకప్పు తెచ్చుకొన్న వాడిదెచ్చు తప్పా? సొమ్మవసరం లేనిదీ ఎక్కువ వడ్డీకప్పిచ్చిన వాడిదెచ్చు తప్పా? మీరే చెప్పండి.

ధన—సొమ్మవసరముందా? ఏం ఖర్చుకు? వంద నూట్రోళ్లిల చొప్పున నేను ఖర్చుకియ్యగలను, భద్రం! నోరెత్తకు పో.

(సుందరం నిష్క్రమించును.)

ధన—ఈలాగు జరగడం మొత్తం మీద నాకట్టే విచారం అనిపించడం లేదు. ఇక ముందు వీడి చర్య జాగ్రతగా కనిపెట్ట వలసి ఉంటుందని ఇందు మూలంగా అయినా నాకు బోధపడింది.

(పాప ప్రవేశించును.)

ధన—ఏం పాపా, వచ్చావా? ఇదిగో ఇప్పుడే వస్తాను, ఉండు. (తనలో) తోటలో సొమ్ము జాగ్రతగా ఉందేమో చూచి రావాలి. (నిష్క్రమించును.)

రామ—(పైకి వచ్చి పాపను చూడకుండ) ఆహా! ఓహో! మంచి గమ్మత్తే! ఆహా! ఓహో!...మరొక గమ్మత్తేమంటే, ఈ ధనదాసెక్కడో అనేక బాపతుల సామానులు దాచి ఉంచాడు; జాబితాలో ఒక వస్తువూ నాకంట ఎప్పుడూ పడ లేదు.

పాప—ఓహో! మా రామన్న బావేనా? ఏం బావా, ఇక్కడున్నావు?

రామ—ఓహో! పాపా? నువ్వీ లాగు వచ్చావేం?

పాప—ఏం వచ్చానా? ప్రతీ చోటికీ ఎందుకు వెళ్తానో ఇక్కడికీ అందుకే వచ్చాను. పై వాళ్ల వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోవడం, వీళ్లూ వాళ్లూ అనకుండా అందరి పనులూ చక్కబెట్టడం, నాకు భగవంతుడు ప్రసాదించిన రవ్వంత తెలివి తేటా నాకు లాభించేటట్టు వినియోగించుకోవడం,—ఇవే గదా నే నెక్కడికి వెళ్లినా చేసే పనులు? కూటి కోసం కోటి విద్యలన్నాడు. ఒకరికి టోపీ వెయ్యకుండా పొట్ట పోసుకోవడం ఏలాగు? వాడి తల వీడికీ, వీడి తల వాడికీ, మార్చక పోతే నా లాంటి బీదరాలికి కాలక్షేపం ఏలాగవుతుంది?

రామ—ఈ ఇంటి యజమానుడితో నీకేమైనా పని ఉందా ఏం?

పాప—ఉంది బావా. ఈయన కోసం చిన్న వ్యవహారం కుదిర్చి పెట్టుతూ ఉన్నాను. అది గాని బందోబస్తు చేస్తే ఈయన తప్పకుండా నాకొక తృణం ముట్ట జెప్తాడు.

రామ—రుణం ముట్ట జెప్పాలి గాని తృణం ముట్ట జెప్పడం వట్టిది. ఇతడి దగ్గర గానీ ఒక చిల్లిగవ్వయినా నువ్వు జెల్లించి లాగ గలిగితే నీది కుశాగ్రబుద్ధే. నాలుక పెరుకుకొంటానన్నా కొత్త కాసు చేత పెట్టని కోతిపిడికిలి కొండముచ్చి గృహస్థు!

పాప—అయి ఉండ వచ్చును బావా. కాని కొన్ని కొన్ని విషయాలలో ఏలాటి రాతిగుండెవాడికైనా మనస్సు కరగక వీలు లేదు.

రామ—ఊం! అలాగే, ఆ పప్పుడకదిక్కడ. కామయ్య దగ్గిరేనా కయికయిలు? ధనదాసంటే ఏలాటి వాడో ఎరగక పోవడం చేత ఈలాటి వెర్రిమొర్రి ఊహలు ఊహిస్తున్నావు. లోకంలో ఉన్న చిక్కని మనుష్యులందరిలోనూ చిక్కని వాడిషి ధనదాసు; రాతి కంటే చిక్కన! ఇనుం కంటే చిక్కన! లోకంలో ఉన్న గట్టి గుండె లన్నిటిలోనూ గట్టి గుండె ధనదాసుది; రాతి కంటే గట్టి! ఇనుం కంటే గట్టి! ఎవరూ ఎవరికీ ఎప్పుడూ చెయ్యని ఎక్కువ మేలు చేసినా సరే, ఒక ఎర్రని ఏగానయినా ఇతని చేతిలోనుంచి పెగిలి పైకి రాదు. నీకు పొగడిక కావాలా? గౌరవం కావాలా? దయ కావాలా? స్నేహం కావాలా? ఓ; నీ చిత్తం; వాటికి వేటికీ కాసంతైనా అభ్యంతరం లేదు. సొమ్మా? ఊహూం; ఆ మాటే ఎత్తకూడదు; అక్కడే వస్తుంది చిక్కు. ఎక్కడైనా బావ గాని వంగతోటి దగ్గిర మాత్రం బావ కాదు: రాతిని పిడిచినా నీరు పడ వచ్చును గాని, ఇతడిని పిడిస్తే ఒక పైసా అయినా పడదు. ఒకరికి "ఇయ్యడం" అంటే ఇతడుకి కెట్టుకుంటాడు. సలహా అయినా సరే ఇస్తాననడు; కావలిస్తే సలహా అప్పిస్తానంటాడు.

పాప—అదంతా కాదనను. అయినా బూలా వేసి సొమ్ము లాగే విద్యంటూ ఒకటుంది. అందులో నన్ను మించిన చెయ్యి లేదు; ఆ విద్య నాకా మూలాగ్రంగా వచ్చును. బూలా వెయ్యడం వెయ్యడం అంటే వేరే కొని తేనక్కర లేదు. దానిలో రహస్యం ఇదీ: ఏం పొగడితే మనస్సు పొంగుతుందో ఆ సంగతి కనిపెట్టి, అందుకు తగినట్టుగా స్తోత్రపాఠాలు గుక్క తిరగకుండా వల్లిస్తే ఏలాటి వాడి దగ్గిరైనా పాచిక పారుతుంది.

రామ—నీ విద్యంతా ఇక్కడమాత్రం బూడిదెలో పోసిన పన్నీరవుతుంది. నీ స్తోత్రపాఠాలు ఇతడి ముందు చెవిటి ఎదుట శంఖూదినట్టు తేలు

తెవి. ఇదే నీకూ నాకూ పందెం: నువ్వు తలపాతుకున్నా సరే సొమ్ము విషయంలో ఇతగాడి మనస్సు మెత్త పరచలేవు. సొమ్మడిగినప్పుడితడు ఏ కటికవాడికీ లేని కటికతనంతో కటకటలాడిస్తూ ప్రాణాలు కటకట కొరుకుకు తింటాడు. ఆకలితో కళ్ళు పేలి చస్తున్నా సరే, ఒక కబళం అన్నం పెట్టడు: ఒక కాస్త గంజిముక్క నోటిలో పొయ్యడు. ఇన్ని మాటలెందుకు? పేరూ, ప్రతిష్ఠా, పరువూ, మర్యాదా, గౌరవం, ఘరానా, వీటి అన్నిటికంటే కూడా ఇతడికెక్కువ కావలసింది సొమ్మే! సొమ్మే ఇతడికి చుట్టాలూ, పక్కాలూ, ఆలూ, బిడ్డలూ, దేవుడూ, దెయ్యమూ, అంతా ఇతడికి సొమ్మే! సొమ్ము తెమ్మని ఎవరైనా అడిగినప్పుడు, ఇతడికి ఎగువ ప్రాణాలు ఎగువనే పోతవి! సొమ్మడిగితే ఇతడిని పక్కలో బల్లెలతో పొడిచినట్టు, కడుపులో కత్తి పెట్టి కెలికినట్టు, గుండెలో గునపాలు పెట్టి గూటాయించినట్టు. ఇంకా—అదిగో, అతడు మళ్లీ వస్తున్నాడు, నేను వెళ్తాను. (నిష్క్రమించును.)

(ధనదాసు ప్రవేశించును.)

ధన—(తనలో) తోటలో సొమ్ము జాగ్రతగానే ఉంది. (ప్రకాశముగా) పాపా, ఉన్నావా?

పాప—ఆహా! ఏం చక్కగా ఉన్నారు బాబూ! నీరు పట్టి మీ ముఖం నిగనిగలాడుతూ ఉంది.

ధన—ఎవరిది, నాముఖమా?

పాప—మీ ముఖం ఇంత నిగారింపుగా ఉండడం ఇంతకు ముందు నేనెప్పుడూ చూడలేదు.

ధన—హాస్యమాడుతున్నావా? నిజమేనా?

పాప—యౌవనం ఇప్పుడిప్పుడే అంకురిస్తూ ఉన్నట్టు కనిపిస్తున్నారు. పాతిక ఏళ్లవాళ్లు ఎంతో మంది మీ కంటే కాలం మళ్లినవాళ్ల లాగు కన బడడం నాకళ్ళారా చూచాను.

ధన—అయినా పాపా, చెప్తే నమ్మతావో లేదో, నాకిప్ప డరవై ఏళ్లు గడిచాయి; డెబ్భయ్యోపడి.

పాప—అరవైయా? అయితే మాత్రం? అందువల్ల మీకు చెక్కుకదెడ చెది రింది? ఒకవడలడం ఉందా? సడలడం ఉందా? పన్ను కదిలిందా? కన్ను చెదిరిందా? మనుష్యుల ఆయుష్కాలం నూటాఇరవై: అందు చేత మీకిప్పుడు నడిప్రాయం; సంపూర్ణయౌవనం.

ధన—నిజమే కాని మరొక ఇరవై ఏళ్లు తక్కువుండడం ఒక ఘర్వాలోది కాదనుకుంటాను.

పాప—అలాగంటావేం బాబూ? ఇరవై ఏళ్లు తక్కువ కోరుకోవడం ఎందుకు, అన్యాయంగా? కాయ శరీరం కావడంచేత నూరేళ్లయినా మీపటు త్వం తగ్గదు గదా?

ధన—నీకు నిజంగానే అలాగు తోస్తుందా?

పాప—సందేహం ఏమిటి? మీ ముఖం చూచే సరికే అలాగు స్పష్టంగా తో స్తుంది. ఏదీ, కొంచెం తల ఎత్తండి. ఆహా! చూచారా, మీనొసలు మీద నాలుగు మడతలూ ఎంతస్ఫుటంగా ఉన్నవో! మడతకు పాతి క చొప్పున మీకు నూరేళ్లకేమీ ఢోకరా లేదు.

ధన—ఈ మడతల గురించి నీకు బాగా తెలుసునా ఏమిటి?

పాప—మడతల సంగతి నాకు తెలియక పోతే మరెవరికి తెలుసును? ఏదీ, చెయ్యి చూపించండి. ఆహా! జెర్రిపోతులాగు ఈ మూలనుంచి ఆ మూ లకు ఏలాగు పాకుకుంటూ పోయిందో!

ధన—ఏమిటది? ఎక్కడ?

పాప—ఇదిగో, ఆయుస్సురేఖ; చూడడం లేదూ ఎంత ఉందో?

ధన—ఉంటే ఏమిటి?

పాప—ఏమిటా? ఇంతకు ముందు నూరేళ్లనా అన్నాను? నూటా ఇరవైకి ఒక్కటయినా తక్కువైతే నాచెవి కదపా ఇస్తాను.

ధన—నిజంగా నేనా?

పాప—నిజమో అబద్ధమో నాకు తెలియదు గాని ఆనూటాఇరవై ఏళ్లయిన తర్వాతయినా మిమ్మల్ని గుండేసి కొట్టి చంపాలి గాని సత్తువ చాలక చావు రాదు. మునిమనమల మునిమనమలను కూడా ఎత్తుతారు.

ధన—అంత ఆయుర్దాయం ఉందేం నాకు? అవును గాని పాపా, మన వ్యవహారం ఏం చేశావు? కాయా? పండా?

పాప—వేరే అడగాలా బాబూ? నేను పట్టడమున్నా, పండు కాకపోవడమున్నా? అందులో సంబంధాలు కుదర్చడం అంటే నాకు పెట్టిన పేరు; కొట్టిన పిండి; ఉగ్గతో రంగరించి పోసిన కులవిద్య. ఏ మొగవాడికీ ఏ ఆడదానికీ అయినా సరే, మూడు మిటకాయలలోకల్లా ముడి పెట్ట గలిగే ఇంద్రజాలమహేంద్రజాలాలెరుగుదును నేను! చివరికి మాసకమ్మకూ సన్యాసివాడికీ అయినా సరే ఏదో టక్కు టమారా గజకర్ణ గోకర్ణవిద్యలు ప్రయోగించి సంధానం చేసే అద్భుతశక్తి ఉంది నా దగ్గిర! ఇక మీ వ్యవహారం ఒక లెక్కా? దీనిలో చిక్కన్న ఊసే లేదు; కష్టమన్న కబురే లేదు. మీరు చెప్పిన పిల్లదానినీ, ఆవిడ తల్లినీ, నేను బాగా ఎరుగుదును. వాళ్లతో మీ పుట్టుపూర్వోత్తరాలన్నీ పూస గుచ్చినట్టు చెప్పాను. వీధిగుమ్మం దగ్గిర తలచిక్కు విప్పుకుంటూ రాధ నిలబడడం; ఆ పిల్లను మీరు చూచి మోహపడడం, పెళ్లి

చేసుకోవాలని మీకు బుద్ధి పుట్టడం,—ఈ మొదలైన యావత్తు సంగ తులూ సక్రుచ్ఛంగా తల్లితో చెప్పాను.

ధన—ఆపడేమంది ?

పాప.—ఏమంటుంది? సంతోషంతో చంకలు గుద్దుకొంటూ ఒప్పుకుంది. మీ కూతురు కమలను ముసలయ్యగారికి ఈ రాత్రి ప్రధానం చేస్తారు కాబట్టి రాధను ఒక మారు పంపించ వలసిందని మీరు కోరినట్టుగా చెప్పాను. ఆవిడ మరే అడ్డూ చెప్పకుండా వెంటనే పిల్లదానిని నా వెంట పంపడానికొప్పుకుంది.

ధన—వాచావా పాపా, ముసలయ్యగారికి ఈ రాత్రి నేనేలాగూ భోజనం పెట్టక తీరదు. రాధను కూడా పిలిచేశామా అంటే, పనిలో పని తేలిపో తుంది, కర్చులో కర్చు కలిసి వస్తుంది. మళ్లీ తరవాత వేరే భోజనం పెట్టనక్కర లేదు.

పాప—అవును; మీరు చేసిన ఆలోచన దివ్యంగా ఉంది. చీకటి పడే లోపు గా ముందుగానే రాధనొక మారు తీసుక వస్తాను. ఆ తరవాత తిరిగీ ఇంటికి వెళ్లి ప్రధానానికీ భోజనానికీ రాత్రి పద్దమీదట వస్తుందట.

ధన—అలాగే కానీ. కావలిస్తే నా బండి ఎరువిస్తాను; దాని మీద ఎక్కి ఆమె ఇంటికి వెళ్లవచ్చును.

పాప—ఓ, చక్కగా ఉంది.

ధన—అన్నట్టు పాపా, అడగ మరచాను. పిల్లదానికేం కట్నమిస్తుందో తల్లి నడిగావా? ఈలాంటి సంబంధం దొరుకుతూ ఉన్నప్పుడు ఏదో కొంచెం కనుపు కట్టుకొనయినా కొంత కట్నం ఇయ్య వలసి ఉంటుందని ఆవి డకు నువ్వు బోధపరిచావా? కొద్దో గొప్పో కట్నం లేకుండా పిల్లదా నిని ఉత్తనే ఎవరైనా పెళ్లాడుతారేమో నువ్వే ఆలోచించు.

పాప—కొర్డో. గొప్పేం? ఆ చిన్నది మీకు సంవత్సరానికి అయిదు వందల రూపాయిలకు తక్కువ కాని ఆస్తి తెస్తుంది.

ధన— సంవత్సరానికి అయిదు వందల రూపాయిలకు తక్కువ కాకుండానా?

పాప—అవును; ఏలాగో వినండి: పిల్ల చిన్నతనంలో చిరుతిండీ అదీ నేర్చుకున్నది కాదు; గంజీ, అన్నమూ, చింతపండు పిక్కా—వీటితో ఎన్నాళ్లయినా కాలక్షేపం చెయ్యగలదు. చేపలనీ, మాంసాలనీ, ఊరుపులనీ వార్పులనీ, తాలింపులనీ, పేలింపులనీ, బూరెలనీ, గారెలనీ, క్షీరాన్నాలనీ, పరమాన్నాలనీ, ఇవన్నీ ఉంటే గాని ముద్ద దిగదని కూర్చోవలసినది కాదు. ఈ విధంగా ఏడాదికి ఒక వంద రూపాయిలయినా మిగులుస్తుంది. ఆ పైని వన్నెలూ చిన్నెలూ కావలసిన పిల్ల కాదు. జల్తారు చీరలు తెమ్మనీ, జరీ వోణీలు తెమ్మనీ, బనారసు చీరలు కావాలనీ, పట్టు రవికలు కావాలనీ, పుష్యరాగాల దుద్దులు తెచ్చి పెట్టుమనీ, పుదుచేరీ గొలుసులు తెచ్చి పెట్టుమనీ, కట్టు కాసుల పేర్లు కొనిపెట్టుమనీ, కమ్మరపటా మొలతాళ్లు కొనిపెట్టుమనీ, పట్టు పట్టుకు కూర్చుని ప్రాణాలు కొరకదు. ఈ రూపంగా మీకు మరొక మూడు వందలు ఏడాదికి మిగులుస్తుంది. ఆ మీద చిన్నతనం నుంచీ ఒళ్లు వంచి కష్టజీవిగా పెరిగిన పిల్ల కాబట్టి ఇంటిలో మరి వేరే నౌకర్లూ చాకర్లూ పెట్టుకోనక్కర లేదు. పాచి పనులు చేసేదీ, నీళ్లు తెచ్చేదీ, వంట వండేదీ, వీళ్లనందరినీ మానిపించ వచ్చును. వీళ్లందరికీ ఏడాదికి ఏం లేదన్నా ఒక వంద రూపాయిలు కాక తప్పవు. ఈ విధంగా ఒక వంద మిగులుస్తుంది. తిండిలో వందా, బట్టలూ నగలలో మూడు వందలూ, నౌకర్లలో వందా, కలిపి వెరసి అయిదు వందలూ అయినవా, లేదా?

ధన—ఇదంతా లాభం కాదని నేననను గాని, ఈ వట్టి లెక్కలతో సంతోషించడమేనా! లేక, ఇప్పుడు నా చేతిలో ఏమైనా లెక్క పడడమంటూ ఉందా?

పాప—ఇవన్నీ వట్టి లెక్కలా? మీతో కాపురం చేసే భార్య జవజంభం లేకుండా సంసారపక్షంగా కాలక్షేపం చేస్తూ, పంచభక్ష్య పరమాన్నాలు కోరనిదీ, నగలూ నాణేల కోసం తంటాలు పెట్టనిదీ, ఇంటి పనులు చెయ్యడంలో ఒళ్ళు దాచుకోనిదీ, కావడం వట్టి లెక్కకిందే కట్టి వేశారా?

ధన—వట్టి లెక్క కాకపోతే ఆ పిల్ల ఫలానా ఫలానా కష్టాలు పెట్టదు కాబట్టి అవన్నీ కలిపి కట్నం అనుకొమ్మంటే అది గట్టి లెక్క ఏలాగవుతుంది? చేతిలో పడ్డ సొమ్ముకే గదా రసీదివ్వడం? పడనిదీ పడదని నే నేలాగ నేద? ఇది ఉత్తుత్త కట్నం లాగుంది. దీనితో నే నేలాగు సంతోషిస్తాను?

పాప—మీకు మరి కట్నం రాదని నేను చెప్పడం లేదు. వాళ్లకేదో ఊరి దగ్గిర కొన్ని భూములున్నవట. అవి మీకు కాకపోతే ఇక ఎవళ్ళకు స్వాధీనపడతవి?

ధన—ఆభూముల సంగతేమిటో జాగ్రతగా చూడాలి. కాని పాపా, ఒక్క విషయం గురించి నాకు కొంచెం అనుమానంగా ఉంది. చిన్నపిల్ల గదా ఆమె? చిన్నపిల్లలకు సాధారణంగా వాళ్లకు ఈడుజోడైన చిన్నవాళ్ల మీదే గదా మనస్సు ఉంటుంది? అలాంటి వాళ్ల స్నేహానికే గదా వాళ్లు సాధారణంగా ఆశపడతారు? నా ఈడు వాడిమీద ఆచిన్నదానికి ఇష్టం పుట్టదేమో? ఈసంబంధం చేసుకోవడంచేత మాకుటుంబంలో అక్కరకుమాలిన చిక్కులేమైనా వస్తవేమో, తరవాత?

పాప—అయితే బాబూ, మీరా చిన్నదాని స్వభావం తిన్నగా కనిపెట్టనే లేదు. తక్కిన కన్యకలకెవ్వరికీ లేని వింతైన గుణం ఆ చిన్నదానికుంది. అదేం చిత్రమో గాని, ఈ పిల్లకు పడుచువాళ్ళంటే పరమాసహ్యం! ఎంతసేపూ ముసలివాళ్లంటేనే ముచ్చట !

ధన—ఆలాగేం?

పాప—ఆ చిన్నది ఈ విషయమై ఎప్పుడైనా ప్రసంగిస్తుండగా మీరు వింటే బోధపడుతుంది. పడుచు మొగవాళ్లు కంటబడితే తల కంటగించుకొంటుంది! పండు గడ్డంతో కంటికి నజరుగా కనిపించే ముసలివాడిని చూడడమంటే బ్రహ్మానందం! ఎంత ముసలివాడైతే ఆ చిన్నదాని కంటికి అంత నవమన్మథుఁడు! ఇదిగో, ఇప్పుడే చెప్పుతున్నాను బాబూ, మీజాగ్రతకోసం; బాగా జ్ఞాపకం ఉంచుకోండి: తలవెండ్రుకలకు రంగు వేసుకోవడం మొదలైన పాట్లేవో పడి, తక్కువ వయస్సు వాళ్ళలాగు కనిపించాలని ప్రయత్నించగలరు; అధమం అరవై ఏళ్లు ఉన్న వరుడైతేనే తప్ప, ఆ పిల్ల పెళ్లే చేసుకోదు. ఇంకా ఆరు నెలలైనా కాలేదు, ఒక సంబంధం ఈలాగే చెడిపోయింది. పెళ్లిపీటలమీద కూర్చున్నప్పుడు పెండ్లికొడుకుకి సులోచనాలు లేకపోవడం కనిపెట్టి, అతడికి ఎంత ఈడని బోగట్టా చేసిందీపిల్ల; ఏభైఆరేళ్లని ఎవరో చెప్పారు; అరవై ఏళ్లు నిండని మొగుడిని నేను పెళ్లాడుతానా అని ఆచిన్నది లేచిపోయిందట ! తరవాత ఎందరెన్ని విధాల చెప్పినా ససేమిరా అని కూర్చుందట !

ధన—ఆమాత్రం తక్కువకే మానుకొందా?

పాప—అరవై ఏళ్లు నిండని మొగుడితో ఏం సౌఖ్యమని అడుగుతుందా చిన్నది. సులోచనాలు పెట్టుకొనే ముసలివాళ్ళను చూస్తే ఆపిల్లకు సూర్యచంద్రులను చూచినట్టుంటుంది.

ధన—ఈసంగతులేవీ నేనింతకు ముందు విననే లేదు.

పాప—ఆ పిల్లకు ఈ విషయమై ఎంత పట్టుదల ఉందో చూస్తేనే తప్ప తిన్నగా మీకు బోధపడనే బోధపడదు. బాబూ, ఆపిల్ల గదిలో కొన్ని కొన్ని పటాలున్నవి; 'ఆపటాలు ఏలాటివనుకొన్నారు? ఒక దుష్యంతుడి బొమ్మనీ, ఒక అర్జునుఁడి బొమ్మనీ, ఒక కృష్ణుడి బొమ్మనీ ఈ లాటివి పెట్టుకొన్నదనుకొన్నారా ఏమిటి? ఆలాటివి పందుకైనా లేవు. ముసలి దశరథుడూ, పెద్దకాలపు భీష్మాచార్యులూ, వంగిపోయిన వశిష్ఠుడూ, పండు గడ్డాల పరాశరుడూ,—ఈ లాటి వాళ్ల పటాలే ఉన్నవన్నీను!

ధన—వహావ్వా ! మంచి శ్లేషగా ఉందే ! నేనీలాగని కలలోనైనా అనుకోలేదు. ఆ చిన్నదాని ఇష్టం ఈ లాటిదని వినడం నాకెంతో కులాసాగా ఉంది. అవును, నిజమే ; నేనాడదాన్నై ఉంటే, నేనూ పడుచు మొగవాళ్లను మోహించక పోయి ఉందును.

పాప—నిశ్చయమే. ఏం పస ఉందని చూచి మోహించాలి పడుచు మొగవాళ్ళను? తక్కుతూ, తారుతూ, నిక్కుతూ, నీల్గుతూ, దిక్కు దిక్కులు చూస్తూ, తిప్పుకుంటూ, కోర చూపులతో, బోర విరుపులతో, వయ్యారపు నడకలతో, వన్నెచిన్నెలతో, గాడిదెల లాగు సగిలిస్తారు; పల్లిగిలిస్తారు; చూచే సరికి నా మనస్సు భగభగ రగిలిపోతుంది. ఈ లాటి వికారాలు చూస్తే ఏ ఆడదానికి ఇష్టం పుడుతుంది ? ఎందుకు పుడుతుంది?

ధన—అవును, నాకూ బోధపడడం లేదు. అయినా కొంత మంది ఆడంగులు ఈలాటి పడుచు రంగేశాలను చూచి రంగుపడి దేవులాడి చస్తారు, ఏం చిత్రమో !

పాప—ఆలాగు రంగు పడేవాళ్ళు, మతీ శ్రుతీ లేని వాళ్ళయి ఉండాలి. కంచు కాగడా వెలిగించి వెదికినా పడుచు నాగమ్మలకు రసికత్వమన్న మాట ఉంటుందా ? గేరాలు దువ్వుకొని కొవ్వుచేత పకపక నవ్వుతూ క

వ్వున కేర్చే యౌవనపు గాడిదెలకు మొగతనం అన్నది కోస్తే ఉంటుందా ? అలాటి ఆడారి పేడిమూతి పొడగట్టలను కన్నెత్తి చూడడానికి ఏ తగిన ఆడది ఒప్పుకుంటుంది ?

ధన—ఇవే సరీగా నేను రోజుకూ ఘోష పెట్టుతూ ఉన్న సంగతులు. ఆడ వాళ్ళలాగు పాపిటలు దిద్దుకొని, పేడి మూతి మీది మూడు వెంట్రుకలూ ముడిపెట్టి ముడిపెట్టి మోటికలలోనుంచి ఎక్కలాగుకొని, కాగితాలు పెట్టి వంచిన గిరజాలలో కత్తిరించి సాఫుగా దువ్విన పింఛాలలో కదిలి పోతవని గడియ గడియకూ సరుదుకుంటూ, ఫెళఫెళలాడుతూ ఉన్న ఇస్త్రీ కమీజులు పాడవుతవేమో అన్న భయంచేత ముందుకు వంగ లేక చేతులు కదపలేక కీలుబొమ్మల లాగు,—వాః! ఏం పొంగు! ఏం పొగరు ! ఏం పొంకం !

పాప—అవును బాబూ, ఎర్రగా బుర్రగా ఉండగానే సరా ? అసుర కుంకలకు మీతో ఎక్కడికెక్కడ సామ్యం ? నక్కెక్కడ ? దేవలోక మెక్కడ ? మీలాటి వాళ్ళు మొగవాళ్ళనిపిస్తారు; మిమ్మల్ని చూస్తే కళ్ళు నిండుతవి. ఆడవాళ్ళకు హాపకు పుట్టించాలనంటే ఈలాగుండాలి ; ఈలాగు ముస్తాబు కావాలి.

ధన—అయితే నేనందకాడినే కదూ ?

పాప—నింపాదిగా అడుగుతారు. అందకాళ్లా?'అందకాడ్షి బంగారు మామలా'? మీ అందం మన్మథుడి అందానికి వంకలు దిద్దుతుంది.ముక్కుం లోపమా? మొగమేం లోపమా? మూడు లోకాలూ గాలించి వెదకినా మీ ఇంపు సొంపులూ, మీ నీటు గోటులూ, మీ కులుకు బెళుకులూ మరెవ్వరి దగ్గరా లేవు. ఏది బాబూ, ఒక్కమారు తిరగండి. వాః ! 'గురివింద గింజంత ఎర్రన, కదురంత తిన్నన,' అని కథలలో చెప్పుతారు లెండి; ఆ మాట మీకు సరీగా సరిపడుతుంది. ఏదండి బాబూ, ఒక్కమారు నడుస్తారా ? వహవ్వా ! ఏం వగ ! ఏం వద్దిక ! ఏం వయ్యారం ! గజ

గమనం, హంసగమనం, వీటిని చూస్తే ఇక వమనమవుతుంది. బాబూ, నేను ముసలిదాననైపోయాను గాని లేక పోతే మిమ్మలిని చూచి గుగ్గిళ్లు మింగి ఉందును.

ధన—గుగ్గిళ్లా?

పాప—కాదు, కాదు ; గుక్కిళ్లు. గొందరచేత మాట తడబడింది. బాబూ, అంతటి సొగసు మీది. ఆ పైని మీ పటుత్వమో ?

ధన—పాపా, గొప్ప చెప్పుకోవడం కాదు గాని, పడుచువాళ్ల కంటే నాకు పటుత్వముంది. ఒక్క ఉబ్బసే దఫదఫాలను కనబడి కళ్లు దగ్గులు దగ్గుస్తూ కూర్చో బెడుతుంది.

పాప—ఆనొక లోపం అనుకున్నారా ఏమిటి? దగ్గు మీకెంతో శోభస్కరంగా ఉంటుంది.

ధన—అయితే పాపా, రాధ ఇంకా నన్ను చూచినట్టా, చూడనట్టా? నేను వీధిలోకి వెళ్లుతూ ఉన్నప్పుడు ఆపిల్ల కళ్లు నామీద పడే ఉండాలే?

పాప—ఇంకా మిమ్మలినా చిన్నది చూడలేదు కాని, మీ ప్రసంగం ఆపిల్ల దగ్గిర ఎన్నో మార్లు వచ్చింది. మీరేలాగుంటారో ఆ సంగతంతా తూచా తప్పకుండా వర్ణించి చెప్పాను. మీ సొగసెంతో, వయసెంతో, గుణాలేలాటివో, ఒక్కటీ విడిచిపెట్ట లేదు. మీ లాటి మొగుడు కోరడం బంగారు పువ్వులతో పూజ చేసి పుట్టడమని బోధపరిచాను.

ధన—మంచి పని చేశావు. నువ్వు చేసిన మేలు నేనాజన్మమూ మరచి పోను

పాప—బాబూ, ఒక్క మనవి: బాబూ, చిన్న దావా ఒకటి ఉంది. కర్చులకు కొంచెం పైసా ఉంగే గాని దావా గెలిచేపట్టు కనబడదు. (ధనదాసు మొగము ముడుచుకొనును.) బాబూ ఈ కొద్ది సహాయమూ చేస్తే మీకు మహా పుణ్యం ఉంటుంది. ఇంతకంటే ఎక్కువ కోర వలసిన దాన

ను కాను. మిమ్మలిని చూడడం ఎప్పుడెప్పుడని తొందరగా ఉంది ఆ చిన్నదానికి. (ధనదాసు సంతోషముతో చూచును.) ఆహా! మిమ్మలిని చూడగానే ఆపిల్ల తప్పకుండా మోహ పడుతుంది. బూరెల లాగు పొంగి ఉండక సాఫుగా సదునుగా ఉన్న మీ బుగ్గలు చూచే సరికి, మొగ్గలు వేస్తుంది ఆ పిల్ల మనస్సు. అన్నిటి కంటే ముఖ్యంగా నడినెత్తి వరకూ ఎగబాకి నున్నగా ఉన్న మీ నుదురు చూచే సరికి వెర్రెత్తి ఆచిన్నది మీ పై బడి పాకులాడక మానదు.

ధన—ఆహా ! పాపా, నీ మాటలు వింటూ ఉంటే నా భుజాలు పొంగుతూ ఉన్నవి.

పాప—నేను చెప్పింది నిజం బాబూ; చాలా ముఖ్యమైనది ఈ దావా. (ధనదాసు మరల మొగము ముడుచుకొనును.) దావా పోయిందంటే ఇక నా పని గోవిందా. ఏమాత్రం సొమ్మున్నా తేలి పోతాను. మిమ్మలిని గురించి చెప్పుతూ ఉన్నప్పుడు ఆపిల్లకు ఏమానందం! (ధనదాసు మరల సంతోషముతో చూచును.) మీ సుగుణాలన్నీ వర్ణించి చెప్పే సరికి సంతోషంచేత ఆపిల్ల మొగం ఇంతయింది. పెళ్లి ఎంతలో అవుతుందా అని తొందర పుట్టేటంత మోహం కలిగించాను.

ధన—పాపా, నాకు చాలా సంతోషంగా ఉంది, నా మాట నమ్ము.

పాప—బాబూ, నే నడిగిన ఈ చిన్న సహాయం కటాక్షించి చేసి పెట్టండి. (ధనదాసు మరల మొగము ముడుచుకొనును.) నా ఇల్లు నిలవబెట్టిన వారవుతారు. జన్మజన్మాలకూ మీ పేరు చెప్పుకుంటాను. దీపం వెలిగించి మీకే ముందు దండం పెట్టుకొంటాను.

ధన—పాపా, పోవాలి ; కొంచెం గాత పని ఉంది.

పాప—బాబూ, ఇంత కంటే మీరు నాకు చెయ్య గలిగిన సహాయం మరేమీ లేదు.

ధన—రాధ కోసం బండి సిద్ధంగా ఉస్తాను.

పాప—బాబూ, ఎంతో అవసరం లేనిదీ ఒళ్లు చంపుకొని మిమ్మలిసీలాగు అడిగి ఉండను.

ధన—రాత్రికి భోజనాలు పెందలాడే అయేటట్టు బందోబస్తు చేస్తాను, ఎవరికీ జబ్బులు రాకుండా.——

పాప—బాబు, బాబూ, మీ పుణ్యం ఉంటుంది. మీ కాళ్లు పట్టుకుంటాను. మీరు తప్ప నాకు గతి లేదు. బాబూ, నిజం చెప్పుతున్నాను: సంతోషమంటే——

ధన—పాపా, పోవాలి, ఎవరో పిలుస్తున్నారు. తరవాత కలుసుకుందాం లే. (నిష్క్రమించును.)

పాప—ఛీ, ముసలి ముండాకొడుకా, నీ నోటిలో పుండు పుట్ట! ఛీ, పిసినిగొట్టు గాడిదె కొడుకా, నిన్ను పెద్దమ్మవారు పెళ్లున పిరుమక తిని వెయ్యా! ఎన్ని ఉయలు వేసి లాలన చేసి కదిపి చూచినా కంగాడు కాడు పీడ గాడిదె కొడుకు? అయినా పెళ్లి కుదర్చడం మానడానికి వీలు లేదు. ఇటునుంచి కాక పోతే, అటునుంచయినా నాకు కట్నం రావడం తప్పదు. (నిష్క్రమించును.)

———



54

## III అంకము.

---

[ధనదాసు, సుందరం, కమల, బలరాం, జగ్గన్న, కన్నయ్యా, సోములు, చీపురు పట్టుకొని గౌరి ప్రవేశింతురు.]

ధన—ఇదిగో, మీరందరూ ఈలాగు రండి. మీలో ఎవరెవరు ఏమేం చెయ్యవలసి ఉంటుందో చెప్పుతాను, జాగ్రతగా వినండి. ఇదిగో గౌరీ, నువ్వు ఇలా రా; నీ సంగతి మొదట చెప్పుతాను. (చీపురు చూచి) ఆయుధం పట్టుకొని యుద్ధసన్నద్ధురాలవయే వచ్చావూ? మంచిది. నువ్వు చెయ్యవలసిన పనేమిటంటే, ఉన్న సామానంతా శుభ్రంగా తోమడం. ఈలాగన్నాను గదా అని, పాత్రసామాను నేలను పెట్టి అదే అరగదియ్యకుమా. ఇంకా నీ పనేమిటంటే, భోజనాల వేళప్పుడు పంచపాత్రలన్నీ నీ దగ్గిరుంచుకొని, కావలసినవిస్తూ ఉండు. దానిలో ఒకటైనా పోయిందంటే నీది పూచీ; నీ జీతంలో నుంచి దాని ఖరీదు పట్టిస్తాను.

జగ్గ—(తనలో) ఆహా! మంచి గడుసు శిక్షే.

ధన—గౌరీ, ఇక నువ్వు వెళ్ళిపో వచ్చును. [గౌరి నిష్క్రమించును.] కన్నయ్యా, సోములూ, మీరిద్దరూ ఇలా రండి. వడ్డన పూచీ అంతా మీది. అయితే ఒకటి: అడగనిదే మాత్రం ఎప్పుడూ ఎవరికీ వడ్డించకండి. కొంత కొంత మంది నాకరులేం చేస్తారంటే, అడగక ముందే వెళ్ళి ఇది తినమనీ అది తినమనీ బలవంతం చేసి వద్దు వద్దంటూ ఉంటే విస్తర్ల మీద దిమ్మరించి పోతారు; అడగాలని బుద్ధి పుట్టని వాళ్లనయినా పది మాటలూపి అడిగేటట్టు బుద్ధి పుట్టిస్తారు. మీరు

మాత్రం ఆలాగు చెయ్యకండి. పది సార్లైనా పిలవకుండా పలకకే పలకకండి. తీరా పలికినప్పుడు చప్పున మంచితీర్థం పట్టుకు వెళ్లండి. ఆలా ఐతే మొగమాటం పడి, ఆ మంచి తీర్థం పుచ్చుకొని లేచిపోతారు.

జగ్గ—(తనలో) అవును; అష్టే తింటే అజీర్ణం చేస్తుంది.

కన్న—బాబూ, ఈ కంపు గుడ్డలు విప్పేసి, చాకింట పడేసి మీరు తెప్పించిన బట్టలు కట్టుకోమ్మంటారా?

ధన—బంధువులు రావడం చూడగానే ఆలాగే కట్టుకుందురు గాని. కట్టుకొన్న తరవాత మహా జాగ్రతగా ఉండాలి సుమండీ, అవి చిరిగిపోగలవు.

సోము—బాబూ, ఇదిగో నాకోసం పుచ్చుకున్న ఈ కుడిచినీకి ముందు వైపున పెద్ద సిరా మచ్చ ఉంది.

కన్న—బాబూ, నన్ను కట్టుకోమ్మన్న ఈ గావంచాను దెయ్యమంత చినుగుంది. మీ ఎదుట అనకూడదు గాని, అది కట్టుకుంటే వెనక పక్క—

ధన—కన్నయ్యా, ఎప్పుడూ నీవు జాగ్రతగా గోడ వైపే ఉంచి ముఖమే చూపిస్తూ ఉండు. సోములూ, సిరా మచ్చ కనిపించకుండా నువ్వు ప్రతీదీ వెనక పక్క నుంచే అందిస్తూ ఉండు. [కన్నయ్య, సోములు, నిష్క్రమింతురు.] అమ్మాయీ కమలా, నువ్వు చెయ్యవలసిన పనేమిటంటే, భోజనాలయి పోయిన తరవాత విస్తళ్లలో ఏమేం ఉండిపోతవో చూచి, అందులో ఎంగిలి తగలని వాటిని తీసి జాగ్రత చెయ్యి. ఎంగిలి తగిలిన వాటిలో కడిగి వెయ్యడానికి వీలున్న వాటిని కడిగి వేసి మంచి పదార్థాలతో కలిపి వెయ్యి. మిగిలిన వాటిని నౌకర్లకూ చాకర్లకూ పెట్టు. ఈ లాటి పనులెల్లా ఇంటిలో ఆడపిల్లలు చక్కబెట్టుకో వలసిందే. ఇంతలో నేను పెళ్లి చేసుకో బోతూ ఉన్న

చిన్నది వస్తుంది. ఆ చిన్నదానికి గౌరవం అదీ నువ్వు చెయ్యవలసి ఉంటుంది. తెలిసిందా?

కమ—తెలిసింది, నాన్నగారూ. (నిష్క్రమించును.)

ధన—ఇక నా పోకేలా కుమారరత్నం గారూ, మీరు వినండి. ఈ పొద్దుటి తమ అవకతవక చర్య కటాక్షించి క్షమిస్తూ ఉన్నాను. మీ సవతి తల్లి వస్తుంది. ఆవిడ వచ్చినప్పుడు మూతి విరవడం, మొగం ఇట్టె పెట్టడం, ఇవేవీ చెయ్యకుండా తగిన గౌరవం చెయ్యాలి, జాగ్రత.

సుంద—మూతి విరుస్తానా! మొగం ఇట్టె పెడ్తానా? అలాగెందుకు చేస్తాను

ధన—ఎందుకేం? అబ్బా! నే నెరగను కాబోలు, సవతి తల్లులు వస్తారంటే మాగట పిల్లలు చేసే అభావ చేష్టలూ! మూతిబిగింపులూ! కొరకొర చూపులూను! పొద్దుట నువ్వు చేసిన అపరాధం నేను క్షమించడమే నీకు కావలిస్తే ఈలాటి అడ్డదిడ్డపు చేష్టలేవీ చెయ్యక ఆవిడయెడల నయవినయాలతో ప్రవర్తించాలి.

సుంద—నాన్నగారూ, నిజం చెప్పవలసివస్తే మట్టుకు, ఆ చిన్నది నాకు సవతి తల్లి కావడం నాకేమాత్రమూ ఘనసక్రించడం లేదు. అయినా ఆమెయెడల తగిన ప్రేమా, ఆదరం, చూపించడంలో మట్టుకు నేనేమాత్రమూ లోపం చెయ్యనని మీరక్షరాలా నమ్మవచ్చును.

ధన—అదెంత కాదు; ఆలాగే కానియ్యి. అంత మట్టుకయినా జాగ్రతగా మసలుకో.

సుంద—అందులో నా లోపం ఏమీ ఉండదని మీరే కనిపెట్టుదురు గాని.

ధన—బుద్ధిమంతుడవైతే ఆలాగే చేస్తావు. (సుందరం నిష్క్రమించును.) బలరాం, ఇక నీతో మాటలాడవలసి ఉంది. ఇదిగో, ఈ జగ్గన్న ఒక్కడు మిగిలి పోయాడు. వీడితో చెప్పవలసినది మొట్టమొదట కానిచ్చి తరవాత నీతో మాటలాడుతాను. ఒరే జగ్గన్నా,—

జగ్గ—బాబు, బాబూ, ఉండండి. మీ బండివాడితోనా మీ వంటపుట్టితో
నా మీరిప్పుడు మాటలాడుతూ ఉంది? ఆరెండు ఉద్యోగాలూ చెలా
యిస్తున్న వాడను నేనొక్కడనే కదూ?
ధన—ఆ ఇద్దరితోనూ మాటలాడ వలసి ఉంది.
జగ్గ—ఆ ఇద్దరిలో ఎవరితో ముందు?
ధన—వంటపుట్టితో.
జగ్గ—అయితే ఒక్క గడియ ఆగండి. (గబగబ లాల్చీ, పాగా, విప్పి గావం
చా పైమీద వేసికొని నిలువబడును.)
ధన—ఇదేమిటి ఈ వాలకమంతాను?
జగ్గ—ఇప్పుడు మీ వంటపుట్టి మీ ఎదుట నిలబడున్నాడు. ఏం చెప్ప వలసి
ఉందో చెప్పండి.
ధన—జగ్గన్నా, ఈ రాత్రి కొందరు బంధువులను భోజనాలకు పిలిచాను.
జగ్గ—(తనలో) ఏమాశ్చర్యం! ఇదేదో లోకోత్పాతమే.
ధన—మంచి వంటలు తయారు చెయ్య గలవా?
జగ్గ—ఓ, నలపాకం, భీమపాకం, మించి పొయ్యేటట్టు చేస్తాను. తగినంత
సొమ్ము మాత్రం ఇయ్యాలి.
ధన—సొమ్మా? మంచి కుమ్మే. ఎప్పుడూ సొమ్మేనా? సొమ్ము సొమ్ము
స్మున్న పాట తప్ప ఇంకొక మాట ఎరగరు కాబోలు! నాలుక
మీద నాట్యమాడుతూ ఉన్నట్టు ఎప్పుడూ సొమ్మే! కలలోనూ
సొమ్మే! కలవరింపులోనూ సొమ్మే! గాఢనిద్రలోనూ సొమ్మే!
జగ్గ—(తనలో) సొమ్మంటే శోక మొస్తుందయ్యా నాకు!
బల—జగ్గన్నా, సొమ్ము తగినంత ఉంటే మంచి వంటలు చెయ్య గలవా?
ఏం మతి లేని మాట! తగినంత సొమ్ముంటే ఆడముండ చేస్తుంది, నీనే

ర్పేమిటుంది? మూలనున్న ముసలమ్మను చెయ్యమన్నా చేస్తుంది, నీ చాకచక్య మేమిటుంది? ఎద్దుమొద్దు వెంగళప్పయినా చేస్తాడు, నీ ప్రయోజకత్వ మేమిటుంది? ఈ మాత్రపు భాగ్యానికేనా భీమపాకం, నలపాకం, అంటూ బిగుదులు పలుకుతున్నావు? నలుడేం చేసే వాడు? ఆ వేళకు దొరికిన ఆకూ, అలమూ, గడ్డీ, గాదా, మన్నూ, మశానమూ, పొయ్యి మీదికెక్కించి దించే సరికి, అవి పంచభక్ష్యపరమాన్నాల కింద తేలి గుమగుమలాడుతూ ఆరు నెలలై అన్నహితవు తప్పిన వాడి కయినా ఆవురావురని ఆకలితో లేచి కూర్చునేటట్టు చేసేవి. ఎక్కువ సొమ్ముంటే గాని తగిన వంటలు కావని ఇక ఏలాగంటావు?

జగ్గ—అయితే తక్కువ సొమ్ముతో తగిన వంటలవుతవా?

బల—ఓ, తప్పకుండా అవుతవి.

జగ్గ—అయ్యా గుమస్తాగారూ, నలుడేం చేసేవాడో, భీముడేం చేసేవాడో, ఆ సులువులేవీ నాకు తెలియవు. మీకు తెలిస్తే కాస్త అనుగ్రహించి చెప్పండి. అంతే కాదు; ఆకూ అలమే వేస్తారో, సింగినాదమూ జీలకర్రే వేస్తారో, మీరే వేసి ఈ వంటపుట్టి పనీ మీరే పూనుకోండి. తగుదునమ్మా అని, అయిన దానిలోకీ కాని దానిలోకీ మీరే అడ్డుగా వస్తూ ఉంటారు.

ధన—ఆఁ, ఆఁ! అక్కడికి చదువు చాలించి, ఏమేం వండ వలసి ఉంటుందో చెప్పు.

జగ్గ—అదిగో, గుమస్తా గారినే అడగండి. తక్కువ సొమ్ముతో తగిన వంటలు చెయ్యిస్తారట గదా ఆయన?

ధన—ఒరే జగ్గన్నా, వినబడుతూ ఉందా? నిన్నే అడిగాను. జవాబు చెప్ప వలసిన వాడవు నువ్వే.

జగ్గ—అయితే భోజనానికెందరుంటారు?

ధన—ఎనిమిది పదిమందంటారు. అయినా అయిదుగురికే ప్రయత్నం చెయ్యి. అయిదుగురికి సరి పడ్డది పదిమందికి మాత్రం సరిపడక పోతుందా?

బల—అది నిశ్చయమే.

జగ్గ—కానీండి! నాకేం పోయింది? రెండు సేర్ల బియ్యం ఉండాలి; పావుసేరు కందిపప్పు; సేరు సెనగపప్పు; అరవీసె పంచదార;—

ధన—పట్నానికంతటికీ సంతర్పణనుకున్నావా ఏమిటి?

జగ్గ—రెండు కోడిపెట్టలు;—

ధన—(జగ్గన్న నోటికడ్డంగా చెయ్యి పెట్టి) అయ్యో! దుర్మార్గుడా, నన్ను చెడిపేస్తావా ఏమిటి?

జగ్గ—పాలు;—

ధన—(మరల జగ్గన్న నోరు మూసి) ఇంకానా?

బల—జగ్గన్నా, ఎవరినీ బ్రతకనియ్యాలని లేదా ఏమిటి! కడుపెక్కా మెక్కించి అందరికీ అజీర్ణపు సంకటం తెస్తేనే కాని నీకు నిద్ర పట్టదు కాబోలు! కడుపు కాస కాలుతూ ఉంటేనే ఒంటికి మంచిదని వైద్యులు చెప్తారు. కావలిస్తే ఆరోగ్యశాస్త్రం చదివి చూడు.

ధన—అవును, బలరాం చెప్పినదానిలో చిన్నమెత్తయినా అబద్ధం లేదు.

బల—జగ్గన్నా, ఇంకా విను: విస్తరి నిండా చెయ్యాడడానికి జాగా లేకుండా పదార్థాలు కుమ్మరించే నువ్వూ నీలాటి వాళ్లూ అమాంతంగా మనుష్యుల ప్రాణాలు తీస్తున్నారన్న మాట. అతి సర్వత్ర వర్జయేత్ అన్నాడు. భోజనాల దగ్గిర అతి బొత్తిగా పనికి రాదు. మనం ఎవరినైనా భోజనాలకు పిలిచినప్పుడు మనం చెయ్య వలసిన విశేషమంటే, ఒకరిని గొంతుక మొయ్యా కూరుకోనియ్య రాదు. ఒక పేగు కాలుతూ ఉండగానే ప్రతీవాళ్లూ లేచి పోయేటట్టు చూడాలి. వేమన్న చెప్పిన

వేదంలో ఏమనుంది? "తిండికొరకె బ్రదికి యుండంగ బోకురా, బ్రదుకు కొరకె తిండి గదర వేమ" అని గదా!

ధన—మహావ్వా! ఎంత శేషుగా చెప్పాడండీ? ఏదీ బలరాం, ఒక్క మారు ఇలా రా. చివరను నువ్వు చదివిన పద్యానికి నిన్ను కౌగిలించుకోవా లని ఉంది నాకు. ఆహా! ఏం చక్కని పద్యం! అతురలకులియ్య వచ్చును, ఎవళ్లయినా డబ్బున్న వాళ్ళు. ఏదీ, ఏలాగా పద్యం? "తిండి కొరకె బ్రదికియుండగదర" అనా? అబ్బెబ్బె! అలాగు కాదే; ఏదీ బలరాం, మళ్లీ చదువు.

బల—"తిండి కొరకె బ్రదికి యుండంగ బోకురా, బ్రదుకు కొరకె తిండి గదర వేమ."

ధన—అవును; జగ్గన్నా, వింటున్నావా? తిండి కొరకు బ్రదుకు కాదు, బ్రదుకు కొరకే తిండి. బలరాం, వేమన్నా ఈ పద్యం చెప్పిన మహానుభావుడు? కవీశ్వరుడంటే ఈ లాంటి వాడు గాని, "గారెలు బూరెలిడ్డెన" లంటూ ఒక కసన్నగాడూ, "కలమాన్నంబు ఘృతంబు పాయస" మంటూ మరొక తొస్సన్నగాడూ చెప్పారండీ కవిత్వం! వాళ్ల మొఖం కవిత్వం లాగే ఉంది. ఆ పద్యాలు చదువుతూ ఉన్నప్పుడే వస్తుంది కడుపు నొప్పి. బలరాం, ఈపద్యం నాకు రాసి పెట్టు; మా భోజనాల గది గుమ్మం మీద చూచేవాళ్లకందరకూ కనిపించేటట్టు పెద్దక్షరా లతో మసిబొగ్గు పెట్టి రాస్తాను.

బల—తప్పకుండా రాసిస్తాను. ఇక రాత్రి భోజనాల మాట గదా! అది నా పూచీ మీద వదలి పెట్టండి. అన్ని ఏర్పాటులూ చేయిస్తాను; అంతా మీ మనస్సుకు సమాధానం అయేటట్టు చేస్తాను.

ధన—అలాగే చెయ్యి.

జగ్గ—అలాగే కానియ్యండి. నాకు కష్టమే తప్పి పోయింది

ధన—బలరాం, నాకేం తోస్తుందంటే, కడుపు నిండేవీ, కర్చెచ్చు కానివీ, కాస్త తినే సరికి మొగసాటు వేసేవీ, ఈ లాటివే జాగ్రత పెట్టించు. బొబ్బర్లూ, కర్రపెండ్లమూ, మాడిఫలపు దుంపలూ,—

బల—అవేవో ఆపాట్లన్నీ నేను పడతాను గదూ. ఆ చింత మీాకేమీా వద్దు.

ధన—జగ్గన్నా, మరి నువ్వు మన బండి దులిపి, గడ్డి వెయ్యాలి.

జగ్గ—బాబు బాబూ, ఆగండి ఒక్క గడియ. ఇప్పుడు బండివాడితో గదా మాటలాడుతున్నారు? (గబగబ లాల్చీ తొడుగుకొని పాగా చుట్టుకొని) ఏమిటీ అన్నారు?

ధన—మన బండి దులిపి గడ్డి వెయ్యాలి; ఆపైని ఎడ్లు సిద్ధం చెయ్యాలి.

జగ్గ—ఎడ్లా? అవి కదలడానికి తగిన స్థితిలో ఉంటేనా? బొత్తిగా జబ్బు చేసి పడిపోయినవి. పడిపోవడమంటే గడ్డి మీాదనుకో గలరు. వట్టి నేల మీాదే అవి పడి ఉన్నవి. మీారు వాటిచేత చెయ్యించిన ఏకాదశీ శుష్కోపవాసాలు ఫలించి, "గడ్డింత లేకా ముడ్డంత ఎండీ వేంచేసెనే ఎద్దులు దేవలోకం'' అన్న స్థితిలోకి వచ్చినవి. వట్టి శవాలు; అస్థిపంజరాలు; అనాథప్రేతాలు. ఉప్పని ఊదితే ఎగిరి పోతవి; తోస్తే తొంబది దిక్కుల తూలి పోతవి.

ధన—పాపం! వాటికట్టే పని లేక పోవడం చేత అలాగు జబ్బు పడి పోయినవి.

జగ్గ—లంఖణాలతో జబ్బు కుదురుతుందా బాబూ? చెయ్యడానికి పని తక్కువని తినడానికి మేత తగ్గించడం ఎక్కడిన్యాయం? కావలిస్తే కష్టమూ ఎక్కువ పెట్టి మేతా ఎక్కువ వెయ్యరాదా? అవి బక్కిల్లాగు చిక్కి పోతూ ఉండడం చూస్తే నాకేడుపు వస్తూ ఉంటుంది. నా ఎడ్లంటే నాకు ప్రాణం. కడు పిగిరి అవి బాధ పడుతూ ఉంటే నేను

బాధ పడుతూ ఉన్నట్టే అనిపిస్తుంది. నా కడుపు కట్టుకొని నాకు పోసే గంజీ కడుగూలో రోజూ వాటికి కొంచెం పోస్తూ ఉన్నాను. ఈ లాటి స్థితిలో బాబూ, వాటిని కనికరం లేకుండా బండి కెలాగు పుయ్యడం?

ధన—రాధ ఇంటి వరకే గదా వెళ్లడం ? ఏమాత్రం దూరం!

జగ్గ—బాబూ, నన్ను చంపేండి గాని వాటిని నా చేతులతో నేనైై పుయ్య లేను. ఇప్పటి వాటి స్థితితో పాటు వాటిని కొరడాతో కొట్టడం కూడా జరిగిందా, గోరుచుట్టుమీద రోకటి పోటే. వాటి కాళ్లే అవి ఈడ్చ లేవు; బండి కూడా ఏలా గీడవగలవు?

బల—ధనదాసుగారూ, మన పొరుగునున్న లచ్చన్నను బండి తోలడానికి పిలుస్తాను. అతడు మనకు వంటలో కూడా సహాయం చెయ్య వలసి ఉంటుంది.

జగ్గ—అలాగే కానియ్యండి. కావలిస్తే అవి ఇంకొకరి చేతుల మీద చావ నియ్యండి; నా కాపాపం వద్దు బాబూ.

బల—జగ్గన్న గారిది పాపం! మహా జాలి గుండె సుమండీ.

జగ్గ—గుమస్తా గారు పాపం! పొక్కులు చిక్కడం ఏమీ ఎరగరు సుమండీ.

ధన—నోరు ముయ్యకపోతే వీపు బద్దలవుతుంది సుమండీ.

జగ్గ—బాబూ, మీరేమంటే దానికల్లా "రామాభిరామా" అంటూ మిమ్మల్లిని చేస్తూ ఉన్న ముఖస్తోత్రాలు వినడం నాకేమీ కిట్టకుండా ఉంది. బియ్యం, పప్పూ, ఉప్పూ, చింతపండూ, నూనే, ఆముదం, గిన్నే, ముంతా, మంచం, కుంచం, వల్లకాడూ, పసినపురం, అన్నీ తనవయినట్టే ఇతగాడు చూస్తూ ఉండడం మీ మెప్పు సంపాదించడానికే. ఈ ఆశ్రయం చూస్తే మీకేదో సుడి పెట్టేటట్టే కనిపిస్తూ ఉంది.

ఈ నటనలూ, ఈ నక్క వినయాలూ, ఈ నాలిముచ్చుతనాలూ చూస్తే నాకు ఒళ్లు మండుకు వస్తూ ఉంది. అతివినయం ధూర్త లక్షణ మని నమ్మండి. ఇతగాడు భళాభళి అని వెనక తాళం వాయిస్తుంటే ఏదో ఆడుతూ ఉన్నారే కాని మీ లోపాలు మీకు తెలియకుండా ఉన్నవి. లోకులు మిమ్మలిని గురించి ఏమనుకుంటూ ఉన్నారో మీ రెరగకుండా ఉన్నారు. ఆమాటలు విన్నప్పుడెల్లా నాకేడుపు వస్తూ ఉంటుంది. ఎన్ని మాటలన్నా, మీ మీద నాకభిమానం పోదు. నాకు ప్రేమన్నదే ఉంటే మొదట నాయెల్లమీద; ఆపైని మీమీద; అంతే తప్ప లోకంలో మరెవ్వరిమీదా లేదు.

ధన—అయితే జగ్గన్నా, వినాలని అడుగుతూ ఉన్నాను. లోకులు నన్ను గురించి ఏమనుకుంటూ ఉన్నారు?

జగ్గ—బాబూ, మీరు కోపం తెచ్చుకోనని అభయహస్తం ఇస్తే చెప్పుతాను.

ధన—అబ్బే! భయం లేదు, చెప్పు.

జగ్గ—నాకు వద్దు బాబూ, మీకు తప్పకుండా కోపం వస్తుంది. నన్ను క్షమించండి.

ధన—జగ్గన్నా, నామాట నమ్ము: నేను కోపం తెచ్చుకోను. ఉన్నసంగతి చెప్పావు గదా అని ఇంకా సంతోషిస్తాను. లోకులు నా గురించి ఏమనుకుంటూ ఉన్నారో వినాలని మహా ఉంది.

జగ్గ—మీరంత పట్టు పట్టి అడుగుతూ ఉన్నారు కాబట్టి నేను విన్నది విన్నట్టు చెప్పుతాను, మరి వినండి: మిమ్మలిని చూచి ప్రతీవాళ్లూ నవ్వడమే; మీ బ్రదుకే నవ్వులాటయి పోయింది. మీ నౌకరం మేమెక్కడైనా కనిపించడం భయం, మీ మీద వెట్టి మమ్మలిని వెక్కిరిస్తారు; వెకాసికాలు చేస్తారు; వేళాకోళాలాడ్తారు. మీ గురించి

ఏదో ఒకటి అంటూ పళ్లు వెళ్లబెట్టితేనే తప్పు వాళ్లకి ఊసే పట్టదు. మీ పీనారితనం గురించి ఎన్నెన్నో కథలు కల్పించి చెప్పుకొని పక్కలెగర వేసుకొంటూ పదారుపళ్లూ కనిపించేటట్టు పకాపక నవ్వుతారు. మీరు కొత్త పంచాంగాలు రాయిస్తారనీ, అందులో ఏకాదశులూ మొదలైన ఉపవాసపు దినాలెక్కువుంటవనీ, ఆ రోజులలో ఇంటిలో ఒకరికీ ఒక పిడచ అన్నం పడి వెయ్యక ఇగర గడ్తారనీ, ఒక కథ! పండుగ పబ్బాలు వస్తవనగా మీరు నౌకరివాళ్లతో ఏవో చీలికయ్యాలు పెట్టుకొని కూర్చుంటారట! ఆ విధంగా వాళ్లకిటా ఇయ్యవలసిన కట్నాలూ కానుకలూ ఎగవేస్తుంటారట! ఇదొక కథ! పొరుగువాళ్ల పిల్లి మీ ఇంటిలో మాంసం దుమ్మొకటి ఎత్తుకు పోతే దాని మీద మీరు దావా తెచ్చారని మరొక కథ! మీ ఎడ్లకు వేసిన ఉలవలు మీరే ఒకనాటి రాత్రి దొంగలాడుతూ ఉండగా మీ బండివాడు,—అనగా నాకు పూర్వమందున్న వాడు;—చీకటిలో గుర్తు పట్టలేక మిమ్ములిని గొడ్డును బాదినట్టు బాదినాడనీ, మీరు కిక్కుమెక్కుమనకుండా ఊరుకున్నారనీ ఇంకొక కథ! ఈలాగు ఈ కథలన్నీ చెప్పుకు వెళ్లితే ఒక పెద్ద భారతమవుతుంది. మేమెక్కడికి వెళ్లినా ఇవే ముచ్చటలు. తలమీద వెండ్రుకలు లేకుండా మిమ్ములిని ఎక్కడికక్కడికే ఏకేస్తున్నారు. అనుంవాడి పెళ్లాం వాడకెల్లా వదినన్నట్టుంది మీ బ్రదుకు. ఎవరి నోట్లో చూచినా మీరే; ఏదయినా అవకతవక సామ్యం చెప్పవలసివస్తే మీ పేరే. మీ సంగతెత్తే సరికి ప్రతీ వాళ్లూ మీరు కొసురుతారనీ, కొదుకుతారనీ, గోరిగిన చోటనే గోరుగుతారనీ, పేడలనీ, పీనారులనీ, పిసినిగొట్టులనీ, లోభులనీ, లుబ్ధులనీ, లుబ్ధాగ్రేసరచక్రవర్తులనీ నానాదుర్భాషలూ ఆడడమే కదా?

సన—(జగ్గన్నను కొట్టుచు) చచ్చుమొగానివి; చవల వెధవవు; చవట నాగమ్మవు; చమురుకాళ్ల పెద్దమ్మవు; చాకలి గాడిదెవు.

జగ్గ—అదిగో, నాకు తెలుసును, ఈలాగు తేలుతుందని. నేను మొదటనే చెప్ప లేదూ, నిజం చెప్పితే మీకు కోపంవస్తుందని? మీరు నమ్మారు కారు.

ధన—వెధవా, మాటా మప్పితం లేకుండా నోటికి వచ్చినట్లల్లా పేలితే కలిగే శాస్తి ఇదే. నోరా, నోరా, నొల్లుకోమ్మంటే వీపా, వీపా, పుచ్చుకోమ్మంటుంది. (నిష్క్రమించును.)

బల—(నవ్వుచు) ఏం జగ్గన్నా, న్యాయంగా ఉన్నదున్నట్టు చెప్పడం ఎంత లాభించిందో చూచావా?

జగ్గ—వెళ్లువెళ్లవయ్యా. ముందు వచ్చిన చెవుల కంటే వెనక వచ్చిన కొమ్ములు వాడన్నట్టు నిన్న గాక మొన్న వచ్చి ఏమిటో మహాఅధికారం ఉన్న వాడి లాగు మాటలాడుతున్నావు. లాభిస్తే లాభిస్తుంది, మానేస్తే మానేస్తుంది; నీకెందుకా ఊసంతా? నీ వీపు పగిలేటప్పుడు కావలిసె నవ్వు; ఇప్పుడు నవ్వితే నేనొప్పుకోను.

బల—జగ్గన్నా, నీపుణ్యముంటుంది. ఉడుకుకొని కోపం; తెచ్చుకోకు.

జగ్గ—(తనలో). ఆఁ! కొంచెం వెనకకు తగ్గుతున్నాడు. ఇప్పుడు కొంచెం డాబు చెలాయిద్దాం. భయపడి లొంగిపోయాడా, బాబూ, అప్పుడు చూడండి నాతమాషా! ఒక్క తడాఖా తీస్తాను. (ప్రకాశముగా) ఇదిగో, పదారు పళ్లూ పైకి పారజాపి నవ్వుతున్నావు. భద్రం సుమా! నవ్వు నాలుగు విధాల చెరుపు. నాకిప్పుడేమీ నవ్వులాటగా లేదు. నా కట్టే కోపం వచ్చిందంటే నీ నవ్వులన్నీ పువ్వులు కాగలవు సుమా. (వేలితో బెదిరించుచు బలరాంను ఒకమూలకు త్రోసికొని వెళ్లును.)

బల—అంతాగ్రహించకు మరి. శాంతం ఖోషి డీ అన్నాడు.

జగ్గ—శాంతం గింతం నై మంగ్తా.

బల—ఏమిటి నీ ఉద్దేశం? ఎందుకీ చిర్రు బుర్రు.

జగ్గ—నన్ను చిర్రుబుర్రంటావా? నువ్వేచిర్రు! నువ్వేబుర్రు; నీ బాబు బుర్రు; నీ తాత బుర్రు; నీ ముత్తాత బుర్రుబుర్రు.

బల—జగ్గన్నా,—

జగ్గ—జగ్గన్నా లేదు; పోయి బుగ్గన్నా లేదు; నా పేరు జగన్నాథరావు నాయుడుగారు. నీ నోరు తిన్నగా తిరగదా ఏం? కర్ర తిరగవేస్తే అదే తిరుగుతుంది.

బల—కర్రంటూ పేలావేమిటి? (వ్రేలితో బెదిరించుచు జగ్గన్నను రెండవమూలకు త్రోసికొని వెళ్లును.)

జగ్గ—అబ్బే! కర్రన్న మాట నేనెత్త లేదే. కర్రావాళ్లింట పెంకులు తిరగవేస్తారన్నాను.

బల—ఓయీ డాబురాముడా, అడ్డదిడ్డంగా పేలావంటే చెమ్డాలెక్కగొట్టాను సుమా.

జగ్గ—అవును బాబూ, ఎక్కగొట్ట వలసినదేనండి.

బల—ఇంతకూ, చెయ్యి చేసుకొందామంటే నా సమానఘాయావాడవు కావు వంటపుట్టి వెధవవు.

జగ్గ—అవునండి మహాప్రభూ, పిచ్చుక మీద బ్రహ్మాస్త్రుధం కూడదండి.

బల—నా సంగతి నీకింకా తిన్నగా బోధపడ లేదు.

జగ్గ—పడిందండి మహారాజా, బోధపడింది.

బల—కర్ర తిరగ వేస్తావే?

జగ్గ—అలాగన లేదండి మహాప్రభో. అన్నా, హాస్యానికే; క్షమించండి మహారాజా.

బల—ఆసికమే? నాతోనేనా ఆసికం? ఇదిగో పరాసికం. (గట్టిగా గూబలు నులిపి నిష్క్రమించును.)

జగ్గ—దీనమ్మ సిగా తరగా! నిజమాడితే నిష్ఠురమేనురోయి. లాభం అనుకొన్నాను; లాభం అక్షరాలా గూబలలోకి వచ్చింది. ఇక ముందికి నిజమాడితే మాదిగరాముడే సరి. మా యజమానుడు నన్ను కొట్టాడంటే అది సబబుగానే ఉంది గాని ఈ గుమస్తాగాడు నన్ను కొట్టడానికి ఏం అధికారం ఉంది? వీలైతే కసి తీర్చుకోకపోతానా?

(రాధ, పాప, ప్రవేశింతురు.)

పాప—ఎవరోయి అక్కడ? నాయుడుగారింట దగ్గిరున్నారా?

జగ్గ—ఉన్నారు, తప్పకుండా ఉన్నారు. (వీపు తడుముకొనుచు) ఉండడంలో అడలేసి మరీ ఉన్నారు.

పాప—మేం వచ్చామని ఒక్కమారు చెప్పుతావా? [జగ్గన్న నిష్క్రమించును.

రాధ—ఆహా! పాపా, నాకు బితుకుగా ఉంది; కాళ్లు గజగజలాడుతూ ఉన్నవి.

పాప—అదెందుకు? బితుకు పడ వలసిన అవసరం నీ కేం వచ్చింది?

రాధ—అయ్యో! ఎందుకని మళ్లీ అడుగుతావా? నన్ను కలకాలమూ కష్టపడమంటూ కట్టిపెట్టా లనుకుంటున్నారు గదా, ఒక అరవై ఏళ్ల వరడకు? ఆ వరడను చూడడమంటే బితుకుగా ఉంటుందా, ఉండదా? నువ్వే చెప్పు.

పాప—అవునవును, నాకు తెలుసును. ఈ వరుడిప్పుడు నీకు వరడ లాగే కనిపిస్తాడు. కోరుకొమ్మంటే నువ్విప్పుడు ధనదాసును కోరుకోవు. ఇంతకు ముందు నువ్వు నాతో అందకాడంటూ వర్ణనచేసి చెప్పావే, ఆ పశువువాడి మీద ఉంది నీకిప్పుడెంత సేపూ మనస్సు.

రాధ—నిజమే పాపా, కాదని కప్పడం ఎందుకు? ఆయన మా ఇంటికి అప్పటప్పట వచ్చారు లే. ఆయన అందమూ చందమూ చూచి నాకాయన మీద మనస్సు నిలిచిందన్నమాట వాస్తవమే.

పాప—అతడెవరో నీకేం తెలుసునా?

రాధ—తెలియదు. నాకు తెలిసినదెంతమట్టుకంటే, ముద్దరాళ్లను మోహసముద్రంలో ముంచవలసిన మోహనాంగుడెవ్వరంటే ఆయనే. పూర్వకాలంలో సీతా, దమయంతీ, వీళ్లకున్నట్టు నాకూ స్వయంవరం ఉన్నట్టయితే ఆ నవమన్మథుడి కంఠాన్నే నేను పూల హారం వేసి ఉందును. ఆయన సుందరాకారం తలచుకొంటూ ఉండడంచేత ఇప్పుడు నాకు బలవంతంగా కట్టబెట్టబోతూ ఉన్న ముసలి కొండముచ్చు అనాకారం మీద మరీ అసహ్యం వేస్తూ ఉంది.

పాప—అవునవును; నువ్వు చెప్పిన లాంటి షోకేలాలందరూ కంటికింపుగానే కనబడతారు; చెవికింపుగా కబురులూ చెప్ప గలరు. కాని వాళ్లలో చాలామంది పైసా పరకా ఉన్నవాళ్లు కారు; వాళ్ల కొంపలన్నీ కొట్టినా తట్టెడు పెంకులు రాలవు. ఆ లాంటి వాళ్లను కట్టుకొని కూటికీ గుడ్డకూ బాధపడుతూ ఉండడం కంటే ఏం కోరితే అవన్నీ తెచ్చిపెట్టుతూ ఉన్న మహారాజు లాంటి ముసలి మొగుడిని పెళ్లాడడం నయం కాదూ ? ముసలి మొగుళ్లను కట్టుకోవడంలో ఏమీ కష్టాలు లేవని నేననను; కొంచెం కంటికీ ముక్కుకూ హితవు కాదని నేనూ ఒప్పుకుంటాను. అయితే కష్టీ ఫలీ అన్నాడు. ఈ మొగుడితో కాపురం ఎన్నాళ్లు? మూన్నాళ్ల ముచ్చటే కదూ? కాస్త కళ్లు మూసుక ఓపిక పట్టావంటే ఇంతలో ఆ ముసలివాడి గుడుగుడు ప్రాణమూ గుటుక్కుమంటుందా; అప్పుడు నీ ఇష్టం, నీ రాజా, కట్టుకోవమ్మా నీ మనసుకు వచ్చిన మన్మథమొలక లాంటి మొగుడని; నిన్నేమీ అనే వాళ్లుండరు.

రాధ—అయ్యో! పాపా, ఏం పాపం వచ్చింది? మనం సుఖపడడానికి ఇంకొ కరి చావు కోరుకోవాలా? మనం ఇన్ని ఊహలూ ఊహిస్తున్నాం గాని అన్నీ అనుకున్నట్టు జరుగుతవా? మనం చావమంటే చస్తారా, బతికమంటే బ్రతుకుతారా?

పాప—అదేమన్న మాట? అతడతిత్వరలో చచ్చి ఆస్తంతా నీ అధీనం చేస్తాడన్న నమ్మకం మీాదే ఈ పెళ్లి. కావలిస్తే పెళ్లి మరతులలో అది ఎక్కిద్దాం. మూాడు నెలలూ. ఈలోపుగా అతడు ప్రపంచయాత్ర పరిసమాప్తి చెయ్యక ఇంకా ఉట్టి కట్టుక ఊగులాడుతూ కూరుచుంటే అది కేవలం అన్యాయమే. అదిగో, అతడూా వస్తున్నాడు.

(ధనదాసు ప్రవేశించును.)

ధన—(రాధతో) కన్యకారత్నమా, కళ్లకు జోడు పెట్టుకొని వచ్చానని కోపగించుకోకుమా. నూరు మెరుపు తీగెల లాగు నిగనిగ మెరుస్తూ చూపును చెదిర్చే నీ దివ్యమంగళవిగ్రహం వట్టి లోచనాలతో,— అందులోనూ నా పాడు లోచనాలతో,—చూడడానికి వీలు లేదు కాబట్టి ఈ సులోచనాలు పెట్టుకొన్నాను. ఆకాశం మీాద ఉన్న చుక్కలను చూడ కలసి వచ్చినప్పుడు అద్దపు బిళ్లలలో నుంచి చూస్తారు; ఎక్కడా లేని చక్కని చుక్కలలోకెల్లా చక్కని చుక్కవు కాబట్టి నిన్నూ అద్దపు బిళ్లలలో నుంచే చూడాలి. ఏం పాపా, ఈ చుక్క, నా మోహంపుటిక్క, రతి చేతి కర్పూరపు ముక్క, మన్మథుడి శృంగార వనంలోని సంపెంగ మొక్క, నాచేతిలో పడ బోయే లెక్క, ఒక్క మాటయినా పలకదు? కరుణతో తన కడకంటి చూపులు నామీాద చిలకదు?

పాప—(ధనదాసుతో) మీా రసికత్వాన్ని చూచి బెంబేరు పడి పోయింది; చిన్నపిల్ల గదా? మొదటిలో ఏలాగూ కొంచెం సిగ్గూ, ఇష్టం ఉన్నా మనస్సుదాచడమూ, ఇవన్నీ ఉండక పోతవా?

ధన—(పాపతో) అవును, నువ్వు చెప్పింది నిజమే. (రాధతో) చిన్నదానా, చిన్ని పలుకుల మైనా, పన్నీటి సోనా, నేను కన్ను వేసిన ఖజానా, అదిగో మన అమ్మాయి వస్తూ ఉంది, చిట్టి పొట్టి కొత్త తల్లిని దర్శనం చెయ్యాలని.

(కమల ప్రవేశించును.)

రాధ—(కమలతో) అమ్మాయీ, నిన్ను చూడడానికి ఇంతకు ముందే రావలసి ఉండేను. రాక పోయినందుకు క్షమించు.

కమ—(రాధతో) అబ్బే! అదేమన్న మాట? వచ్చి చూడ వలసిన బాధ్యత నాదే. చివరికి, నేను ముందు వచ్చి చూడడం జరిగింది కాదు గదా అని నాకు సిగ్గుగా ఉంది.

ధన—(రాధతో) చూచావా, ఎంత ఏపరి పిల్లో? కుక్క గొడుగులు ఒక్క రోజుకే ఎదిగి పోతవి లే.

రాధ—(పాపతో మెల్లగా) ఏం అసందర్భపు మనిషి! కూతురినే ఈ లాగ నడమా?

ధన—(పాపతో) నా చిలుకపలుకుల చిన్నెలాడి ఏమంటుంది? నా కులుకు బెళుకుల వన్నెలాడి ఏమంటుంది?

పాప—(ధనదాసుతో) మీ సరసానికీ సందర్భానికీ సంతోషిస్తూ ఉంది.

ధన—(రాధతో) నా సన్నజాజుల తోటా, నా బంగారు కోటా, నా రత్నాల పేటా, నా వరాల మూటా, నా "కానంద మానంద మాయేనే!" (గంతును.)

రాధ—(పాపతో మెల్లగా) వాలకం బాగానే ఉంది.

ధన—(రాధతో) ఇంతీ, చేమంతీ, నా మల్లిపువ్వుల బంతీ, నా సూపాల దొంతీ, నా రూపాయిల దొంతీ,—(గంతును.)

రాధ—(పాపతో మెల్లగా) ఏం చెయ్యం నునిషే! నాకు భయం వేస్తూ ఉంది.

ధన—(రాధతో) ముద్దుగుమ్మా, అమృతంపు చెమ్మా, నే పట్టుకోనే కొమ్మా, నా పెళ్లో పడే సొమ్మా, "లెయ్యరె బొమ్మా, నీ మొగుడి తోటి సమ్మా!" (గంతును.)

రాధ—(పాపతో మెల్లగా) ఈ అమ్మవారి వేషం మరి నేను చూడ లేను.

(సుందరం, బలరాం, వెనుకను నడుచుచు సోములును ప్రవేశింతురు.)

ధన—ఇదుగో, మన అబ్బాయి వస్తూ ఉన్నాడు, చిట్టి పొట్టి కొత్త తల్లిని దర్శనం చెయ్యాలని.

రాధ—(గతుక్కుమని పాపతో మెల్లగా) పాపా, ఇదేమిటే ఈ వింత? కథలలో చెప్పుకొనే అద్భుతాల లాగుందే! నేను నీతో ఇంతకు ముందు చెప్పానే, ఆయ నే ఈయన.

పాప—(రాధతో మెల్లగా) ఏమిటీ? ఆహా! ఏం ఆశ్చర్యం!

ధన—(రాధతో మెల్లగా) సుందరీమణీ, మన పిల్లలు ఇంత పెద్దవాళ్లు గదా అని అద్భుతంగా చూస్తూ ఉన్నట్టున్నావు? వీళ్ల ఇద్దరినీ పైకి తగిలి వేసే ఆలోచనలోనే ఉన్నాను లే.

సుంద—(రాధతో) అమ్మాయీ,—

ధన—'అమ్మాయి' ఏమిటి, నీ మొఖం? 'అమ్మా' అని పిలు.

సుంద—(రాధతో) అమ్మాయీ, ఈలాగు జరుగుతుందని నేనెప్పుడూ అనుకో లేదు. ఇది కేవలమూ అకస్మాత్తుగా జరిగిందని నమ్ము. మా నాన్న గారు ఈ ఉదయమే తమ ఉద్దేశం నాతో చెప్పారు.

ధన—(తనలో) సవతితల్లి రావడమంటే ఎంత అయిష్టం! ముందుగా తెలిస్తే ఏం చేస్తాడో?



రాధ—(సుందరంతో) ఇదికేవలమూ అకస్మాత్తుగా జరిగిందని నేనూ అన వలసే ఉంది. నాకు ఇప్పటిప్పటి వరకూ ఏమీ తెలియనే తెలియదు.

ధన—(తనలో) పాపం! వాడి మోటు మాటలకు ఈలాంటి అసందర్భపు జవాబు చెప్ప వలసి వచ్చింది.

సుంద—(రాధతో) మా ఇంటికి నువ్వు రావడమనేది నాకు చాలా సంతోషమే కాని, మాకు మారటతల్లిగా నువ్వు ఉండడమనేది మాత్రం నాకు ఏ మాత్రమూ మనస్కరించడం లేదు. నన్నేం చేసినా సరే గాని, అందుకు మాత్రం నేనొప్పుకోను. ఈలాగన్నందుకు నన్ను క్షమించు. కొందరికి నేనంటూఉన్న మాటలు కంటకంగా ఉండ వచ్చును. నువ్వు మట్టుకు నా ఉద్దేశం తిన్నగా తెలుసుకోగల వని నా నమ్మకం. ఈ వివాహం నాకు ప్రాణసంకటమే అని నమ్ము. నేనంటే ఎవరినో నీకు తెలిసింది కాబట్టి, ఇక నువ్వే ఆలోచించుకో వచ్చును, ఈ పెళ్లి వల్ల నాకెన్ని విధాలా ఎంత నష్టమో. నా ఇష్టమే సాగే పక్షానికి, ఈ పెళ్లి నా ప్రాణం పోయినా జరగనియ్యను.

ధన—(తనలో) ఏం వెంకెతనంగానూ పెడసరంగానూ పేలాడు! ఏమనుకుంటుందో పాపం?

రాధ—(సుందరంతో) నేను చెప్ప వలసిన జవాబేమిటంటే, నా ఉద్దేశమూ దాదాపుగా ఆలాగే ఉంది. నేను మీకు మారట తల్లిని కావడం మీకెంత కష్టమో, మీరు నాకు మారట పిల్లలు కావడం నాకూ అంత కష్టంగానే ఉంటుంది. నా ప్రయత్నాన్ని పురస్కరించుకొని ఈ చిక్కేమీ రాలేదని మున్ముందుకే నమ్మ వలెను. నా మూలంగా మీకు కొంచెమయినా ఆయాసం కలగడం నా ఉద్దేశం కాదు. నాకు వల్ల తప్పి వచ్చే గండకత్తెర ఏదైనా మెడమీద పడితేనే తప్ప, మీకింత అయిష్టమైన పెళ్లికి నేనై ఒప్పుకోను.

ధన—(తనలో) పాపం! అంతకంటే మరేం చెప్ప గలదు? చెప్పొచ్చుక క్రొట్ట నట్టు చెప్పింది. కుక్క కాటుకు చెప్పుదెబ్బే మందు. (రాధతో ప్రకాశముగా) కన్యకారత్నమా, మన అబ్బాయి వెంకి పేలాపనను క్షమించు. వాడు శుద్ధ ఎద్దుమొద్దు స్వరూపం; అన వలసిందేమిటో, అన రానిదేమిటో ఆ విచక్షణ కూడా లేదు.

రాధ—అబ్బే! నాకేమీ కోపం రాలేదు, నమ్మండి. ఇంత బాహాటంగా మనస్సులో ఉన్న ఊహలన్నీ పైకి చెప్పినందుకు కావలిస్తే సంతోషంగా ఉంది. ఇంతకంటే వేరు మోస్తరుగా మాటలాడి ఉంటేనే ఇంకా నాకు కోపం వచ్చి ఉండును.

ధన—ఆఁ! ఆలాగు వెక్కిరించి గడ్డి పెట్టు, ఇకనైనా బుద్ధి వస్తుందేమో. కాలక్రమేణా వీడి మతి తిరగ వచ్చు ననుకొంటాను.

సుంద—నాన్న గారూ, కాలక్రమేణ కాదు గదా జన్మజన్మాలకూ నామతి తిరగ వలసింది కాదు. అది నిశ్చయమని ముమ్మాటికీ నమ్మండి.

ధన—ఎక్కడయినా ఈ లాటి వెంకితనం ఉందా? చదవ వెయ్యగా ఉన్న మతి పోతూ ఉంది కాబోలు!

సుంద—నాన్న గారూ, అయితే మనస్సులో ఉన్నదొకటీ, పైక నేదొకటీ కావడం మీ కిష్టమేనా?

ధన—అదిగో, ఇంకానా? ఎడదిడ్డమంటే పెడదిడ్డ మంటూ, ఎంత సేపు?

సుంద—నాన్న గారూ, మీరు నిర్బంధ పెట్టుతూ ఉన్నారు కాబట్టి మీ మాట తోసి వెయ్యడమెందుకు? అమ్మాయీ, మా నాన్న గారికిష్టమయేటట్టు వారి స్థానే నీతో కొంత సేపు ప్రసంగిస్తాను. నీలాటి త్రిభువనసుందరిని ఇంతకు ముందు నేనెప్పుడూ చూడ లేదు. నీకు సేవ చెయ్యడం కంటే ఎక్కువ సంతోషకార్యం మరేదీ లోకంలో ఉండ బోదు.

నిన్ను పెళ్లాడడమనగా త్రిలోకాధిపత్యం పొందడం, దేవేంద్రభోగం అనుభవించడం, స్వర్గం అరచేతిలోకి రావడం,— అంతకంటే కోరుకో వలసిన ఎక్కువ పదవే మరి లేదు. నువ్వు నా సొత్తువని ఎవడనుకుంటాడో వాడికి నవనిధు లెందుకు, చింతామ ణెందుకు, కౌస్తుభమాణిక్య మెందుకు? నిన్ను ముద్దు పెట్టుకొనే భాగ్యం—

ధన—ఆఁ, ఆఁ, అట్టె, అట్టె! కొంచెం పస్తాయించు.

సుంద—నాన్న గారూ, మీరనమన్నారని మీ తరఫున ఈ మాటలన్నీ అంటు న్నాను.

ధన—నా తరఫూ తురఫూ ఎందుకు? నాకు నాలుక ఉందే; నానోరు పడిపో లేదే. ఇది మధ్యవర్తి ద్వారా పరిష్కరించుకో వలసిన వ్యవహారం కాదు. అందులోనూ నీలాటి అవకతవక మధ్యవర్తా?— సోములూ, చాప తే.

పాప—బాబూ! ఇక మేం సెలవు పుచ్చుకొని తిరిగీ త్వరలో వస్తాం.

ధన—సోములూ, బండి కట్టించు.

సోము—చిత్తం. (వెనుకనుంచియే జవాబు చెప్పి నిష్క్రమించును.)

ధన—కన్యకామణీ, మాటల సందడిని నీకు ఫలహారం కోసం ఏమైనా తెప్పించడం మరిచి పోయాను; క్షమించు. ఇప్పుడు తెప్పించాలంటే ఆలస్యమై పోతుంది.

సుంద—నాన్న గారూ, అందు విషయమై నేను బందోబస్తు చేశాను. బజారుకు పంపించి మీపద్దు మీద ఒక డజను సపోటా పళ్లు, ఒక 7ల చక్రకేళీలూ, ఒక సేరు ఆవుపాలూ తెప్పించాను.

ధన—(బలరాంతో రహస్యంగా) ఏమిటి బలరాం, ఇదంతానూ?

జల—(ధనదాసుతో రహస్యంగా) నాకూ బోధపడడం లేదు. అబ్బాయి గారి మతి పోయింది కాబోలు!

సుంద—నాన్నగారూ, ఇవి చాలవేమో అని కాబోలు బలరాంతో ఆలోచిస్తున్నారు. అమ్మాయీ, ఏ లోపం వచ్చినా గడుపుకొనే పూచీ నీది.

రాధ—ఇవన్నీ అవసరమే లేదు.

సుంద—అమ్మాయీ, మా నాన్నగారి వేలికున్న ఉంగరం చూచావా? ఈ వజ్రపు పొడి ఎంత తళతళలాడుతుందో!

రాధ—అవును, దానికి మంచి తళుకున్నట్లే ఉంది!

సుంద—ఇదిగో, దగ్గిరనా చూడు. (ధనదాసు వేలి నుండి ఉంగరము తీసి రాధ కిచ్చును.)

రాధ—(పుచ్చుకొని) మంచి పసందుగా ఉంది. కాంతి చాలా హెచ్చు. (ధనదాసుకు మరల ఇయ్యబోవును.)

సుంద—(అడ్డు వచ్చి) అది రత్నం; నువ్వు స్త్రీరత్నానివి. అది నీ వేలినే ఉండ దగినది. అది నీకు మా నాన్నగారిచ్చిన కానుక.

ధన—నేను—?

సుంద—నాన్నగారూ, ఇది ఈ అమ్మాయిని ఉంచుకొమ్మనే గదూ మీ ఉద్దేశం?

ధన—(సుందరంతో రహస్యంగా) ఏమిటి?

సుంద—(గట్టిగా) అవునవును, నాన్నగారూ, మిమ్మలిని వేరే అడగనవసరం లేదు. అమ్మాయీ, చూచావా, నిన్ను బలవంతంచేసి ఒప్పించుమని మా నాన్నగారు ఏలాగు సంజ్ఞలు చేస్తున్నారో?

రాధ—వద్దు, నాకిది వద్దు.

సుంద—వద్దంటే వల్ల కాదు. మా నాన్నగారు ఇది తిరిగీ పుచ్చుకోరు.

ధన—(తనలో) నా ఒళ్లు మండుతూ ఉంది. తాకట్టు వస్తువు పైకి తీసి పెట్టు
కోవడం నాదే తప్పు. బుద్ధి గడ్డి తిని పెట్టుకున్నాను. పోకు చెలా
యించ బోయాను. ఈ కుంకాక్షి వెధవ నన్నేడిపిస్తూ ఉన్నాడు.
దేవుడా, ఏం గతి?

రాధ—ఇంత విలువైనది నేనేలాగు పుచ్చుకోనేది? ఇందండి. (ధనదాసుకు
ఇయ్య బోవును.)

సుంద—(అడ్డువచ్చి) వెల లేని మాణిక్యానివి నువ్వు. నీ ఎదుట దీని విలువే
మాత్రం? ఉంచు.

రాధ—నా మాట వినండి.

సుంద—నామాట నువ్వు విను.

ధన—(తనలో) ఇయ్యానియ్యడు కాబోలు దుర్భాగ్యపు వెధవ!

సుంద—నువ్వు పుచ్చుకోకుండా తంటాలు పెడుతున్నావని మా నాన్న గారు
చూడు, ఏలాగు ఇబ్బంది పడుతున్నారో!

ధన—(సుందరంతో రహస్యంగా) ఛీ, దొమ్మరి వెధవా!

సుంద—(గట్టిగా) ఉండండి, చెప్పుతాను. అమ్మాయీ, చూచావా, ఎంత
తొందర పడుతున్నారో?

ధన—(సుందరంతో రహస్యంగా) ఛీ, దూబరి వెధవా!

సుంద—(గట్టిగా) నాన్నగారూ నా తప్పేముంది, నన్ను కోపపడతారు?
నేను చెపుతూనే ఉన్నాను. ఆ పిల్లే తిక్క పట్టు పట్టుకు కూర్చుంది.

ధన—(సుందరంతో రహస్యంగా) ఛీ, దున్నపోతు వెధవా!

సుంద—(గట్టిగా) అమ్మాయీ, మధ్య నిన్నుంచి నన్ను కోంపడుతున్నారు.
ఈలాగు నన్ను తిట్టించడం న్యాయమేనా? పుచ్చుకో.

ఈచిన్నది మీ కోడలా అంటే ఏమని చెప్పేది? అందుచేత నేను చేసుకోవడం మానివేసి, తరా సంబంధం అడగడం జరిగింది కాబట్టి, నీకే ఈ పిల్లదానిని వివాహం చేసి నిజంగా నాకోడలిని చేసుకుందామా అని ఆలోచన పుట్టింది. ఆ పిల్లంటే నీకసహ్యా మంటూ ఉన్నావు కాబట్టి మరందుకు వీలులేదు.

సుంద—నాకు పెళ్లి చెయ్యాలనుకున్నారా?

ధన—అవును.

సుంద—రాధనా?

ధన—అవును, రాధనే.

సుంద—ఆపిల్ల నాకు నచ్చ లేదన్న మాట నిశ్చయమే కాని, మీ ఆజ్ఞ శిరసావహించడం నాకు విధి కాబట్టి, ఏలాగో మనస్సు సమాధాన పరుచుకొని పెళ్లి చేసుకొని మిమ్మలిని సంతోష పరుస్తాను.

ధన—నన్ను సంతోష పరుస్తావా? అబ్బెబ్బే! నేనంతి జేసబబు మనిషిననుకున్నావా ఏమిటి? నిన్ను నేనేమాత్రమూ నిర్బంధ పెట్ట వలసిన వాడను కాను.

సుంద—అలాగు కాదు; నామనస్సు ఆ చిన్నదానిమీదికేలాగయినా కష్టపడి తిప్పుకుంటాను.

ధన—ఆ కష్టమెందుకు పాపం! నీకు? ఇష్టంలేని పెళ్లిళ్లు చేస్తే నష్టాలువస్తవి.

సుంద—నాన్నగారూ, మొట్ట మొదటే ఏలాగు పుట్టుకు వస్తుంది ఇష్టం? 'పెళ్ళి మొదట, ప్రేమ వెనుదట,' అన్నది సామెత లాటిదే.

ధన—అలాగు కళ్ళు మూసుకొని దిగడం ఎప్పుడూ పొరపాటే. పెళ్లి చేసుకుంటే ప్రేమపుట్టక పోతుందా అన్న నమ్మకంమీద తీరా పెళ్ళాడిన

తరవాత, ఒక వేళ పుట్టక పోతేనో? అప్పుడెన్నెన్ని చిక్కులు వస్తవి? కొంచెమైనా మొదట ఇష్టమన్నదుంటే ఇంకా అంత చెప్పను. నీకు కేవలమూ అసహ్యమే అంటూ ఉన్నావే, ఇక ఏలాగు? నీకు కాస్త కాకపోతే కాస్తయినా ప్రేమ ఉంటే తప్పకుండా నీకే పెళ్లి చేసి ఉందును. ఇక తప్పని సరిగా నేనే పెళ్లాడవలెను.

సుంద—నాన్నగారూ, అలాగంటున్నారు కాబట్టి ఇక దాపరికం ఎందుకు? మా గుట్టు మీతో చెప్పేస్తాను, వినండి. అసహ్యం, గిసహ్యం, అంటూ చెప్పానే అవన్నీ వట్టి బొల్లిమాటలు. నెల రోజుల కిందటే ఈ పిల్లదానిని నేను చూడడం తటస్థించింది. అప్పటి నుంచీ మోహంచేత నేను పడుతూ ఉన్న బాధ భగవంతుడికే తెలియాలి. ఆపిల్లను నాకేలాగైనా పెళ్లి చెయ్యమని మిమ్మల్ని అడగాలని కూడా నిశ్చయించుకున్నాను. ఇంతటిలో మీరే ఆ పిల్లను పెళ్లాడుతారని చెప్పడం చేత, ఏం గతి భగవంతుడా అని కరచరణాదులాడకకూర్చున్నాను.

ధన—ఆచిన్నదాని ఇంటికెప్పుడైనా వెళ్లావా?

సుంద—వెళ్లాను.

ధన—చాలా మార్లా?

సుంద—మాకు పరిచయమైన నెల రోజులూ ఈ మధ్య చాలా మార్లే.

ధన—నువ్వు రావడం ఆ పిల్లకు ఇష్టమున్నట్టే కనపడ్డదా?

సుంద—చాలా ఇష్టమున్నట్టు కనపడ్డది. అయితే నేనంటే ఎవరో, అది మాత్రం ఆపిల్ల ఎరగదు. అందుచేతనే ఈ వేళ నన్ను చూచే సరికి అంత గితుక్కుమన్నది.

ధన—నీకు తన మీద మోహం ఉందనీ, నువ్వు తనను పెళ్ళి చేసుకోవాలను కుంటున్నావనీ, ఆపిల్లతో ఎప్పుడైనా చెప్పావా?

సుంద—చెప్పాను. పిల్లతో చెప్పడమే కాకుండా, తల్లితో కూడా ఈ సంగతి కొంచెం ప్రస్తావించాను.

ధన—తల్లేమైనా ఒప్పుదల కనబరిచించా ?

సుంద—పిల్ల ఒప్పుదల ఉంటే తల్లి అడ్డేటట్టు కనబడలేదు.

ధన—చిన్నదానికి నీమీద తగినంత మోహముందా ?

సుంద—చూపులబట్టీ చేష్టలబట్టీ ఆలోచిస్తే తప్పకుండా ఉన్నదనే తోస్తుంది.

ధన—(తనలో) నా కిట్టింపు మాటలచేత వీడి గుట్టంతా బట్ట బయలయింది. ఈ సంగతి ముందుగా తెలియడమే మంచిది. (ప్రకాశముగా) ఇదుగోనోయి అబ్బాయి, నేను చెప్పబోయే సంగతి కొంచెం కబడ్దారీగా మాత్రం విను. కష్టమని అలోచించక కాస్త శ్రమ పడి రాధ మీద నీకున్న రవ్వంత ప్రేమా ఉగమింగుకో, తెలిసిందా ? ఆ పిల్లను నేను పెళ్ళాడ బోతూ ఉన్నాను కాబట్టి ఆవైపు నువ్వింక కన్నయినా ఎత్తడానికి వీలులేదు. అచ్చికలూ బుచ్చికలూ అసలే వద్దు. నీకోసం ఒక భార్యను కుదిర్చాను ; త్వరలో పెళ్ళికూడా చేస్తాను.

సుంద—అయితే నాన్నగారూ, బెల్లించి నా గుట్టుచుట్టంతా ఈలాగు ఎక్కలాగడం మీకు న్యాయమేనా ? సరే, వ్యవహారం ఇంత వరకూ వచ్చింది కాబట్టి ఇక మొగమాటం ఎందుకు ? చల్లకు వచ్చి ముంత దాచడమేం ? రాధ మీద మోహం అటు సూర్యుడిటు పొడిచినా సరే నేను మానను, మానను, ముమ్మాటికీ మానను. త్రినేత్రుడు దిగి వచ్చినా, నా మోహం తప్పించ లేడని నమ్మండి. మీతో పోటీ తగిలి మీకు రాధ దక్కకుండా చెయ్యడానికి ఏమేం పాట్లు పడ వల

ఉందో అవన్నీ పడే తీరుతాను. నా బొందిలో ప్రాణాలుండగా ఆ పిల్ల మీపాలుకాదు. తల్లి మెడలు విరిచి మీరు సంబంధానికి ఒప్పిస్తానంటూరేమో, అందుకు తగిన కిస్సా ఏదో నాకూ ఉండక పోదు.

ధన—హాత్ ! ఆకతాయి వెధవా, పెద్ద కుండలకే ఎసరు. పెట్ట దలచు కున్నావా ?

సుంద—మీరే చిన్నకుండల కెసరు పెట్ట దలచుకున్నారు.

ధన—పెంకె వెధవా, నీకు చిన్నంతరువూ పెద్దంతరువూ కూడా లేదా? తండ్రి నన్న గౌరవం లేదా ?

సుంద—కొన్ని కొన్ని సంగతులలో పిల్లలు తండ్రులను మన్నించాలన్న శాస్త్రం లేదు ; అలాటి వాటిలో మోహం ఒకటి.

ధన—పేలుగాయ వెధవా, ఈ పెళ్లి కాదు గాని వేరే వారి పిల్లను పెళ్లి చేస్తానుండు.

సుంద—మీ బెదిరింపులకు బెసకనండోయి. ఆ ఈడు గడిచింది.

ధన—అయితే రాధను నాకు విడిచి పెడతావా ? లేదా ?

సుంద—నా ప్రాణం విడుస్తానుగాని రాధను విడవను.

ధన—ఎవడురా అక్కడ ? తే త్వరగా బెత్తాం—

(జగ్గన్న పరుగున ప్రవేశించును.)

జగ్గ—ఆగండి, బాబూ, ఆగండి. ఏమిటి ఈ రంధి ? ఎవరైనా వింటే ఏమనుకుంటారు?

సుంద—ఏమైనా సరే. ప్రాణం నొప్పి పెట్టిన తరువాత ఎవరేమనుకుంటారు ? కలిస్తే రాజూ బంటూ ఒకటే.

జగ్గ—సుందరం బాబూ, తొందర పడకండి.

ధన—రాలుడుగాయ వెధవకు కళ్లు నెత్తి మీదికి వచ్చాయి. యతంటే ప్రతీటూ ఎంత పెడసరంగా పేలుతాడో!

జగ్గ—ధనదాసు బాబూ, కోప పడకండి.

సుంద—ఏమైనా కానీ. తెగించినవాడికి తెడ్డే లింగం. నిలుపుకుంటే నే పెద్దరికం.

జగ్గ—(సుందరంతో) ఏమిటి, తండ్రి నేనా ఈమాటలు?

ధన—వెధవని వీపు పెట్లేటట్టు తంతాను.

జగ్గ—(ధనదాసుతో) ఏమిటీ, కొడుకు నేనా? నన్నంటే వేరు సంగతి.

ధన—ఒరే జగ్గన్నా, నిన్ను మధ్యవర్తిని చేస్తాను. చూడు, న్యాయం నా పక్షం ఉంది

జగ్గ—అలాగేనండి. (సుందరంతో) బాబూ, మీరు దూరంగా వెళ్లండి.

ధన—ఒరేవు ఒక చిన్నదుందిరా. ఆపిల్లను నేను మోహించి పెళ్లాడ దలచుకొన్నానురా. పిల్లకూ తల్లికీ సమాధానమేనురా. ఈ లాంటి విషయంలో ఈ గుంట వెధవ నా ఎదటికి తణుకూ బెణుకూ లేకుండా వచ్చి అంటాడూ: తన కా పిల్లమీద మోహం ఉందట! తానే పెళ్లాడుతాడట! చూడు, ఎంత విపరీతమో!

జగ్గ—అబ్బాయి గారిది చాలా పొరపాటు.

ధన—పెళ్లాం కోసం తండ్రితో కొడుకు పోటీ తగలడం కంటే అసందర్భం ఉంటుందా? నాకు మోహముందని తెలియగానే వాడాలాంటి ఊహ వదలుకో వలసిందా, కాదా?

జగ్గ—మీరు చెప్పింది సబబుగా ఉంది. మీరిక్కడే ఉండండి. అబ్బాయి గారితో మాటాడి చూస్తాను. (సుందరం దగ్గరకు వెళ్లును.)

సుంద—జగ్గన్నా, నిన్ను మధ్యవర్తిని చేసే పక్షానికి నాకు కూడా ఒప్పుదలే. ఎవరు మధ్యవర్తయితే ఏం ? న్యాయము చెప్పక తీరదుగదా ?

జగ్గ—న్యాయానికి నాది పెట్టిన పేరండి. ఏ పంచాయతీ తీర్పయినా నేను లేకుండా జరగనే జరగదు. ఏ లాటి తెగని తగవైనా నేనిట్టే తీరుస్తాను.

సుంద—ఒరేవు, ఒక చిన్నదుండిరా. ఆ పిల్లను నేను మోహించి పెళ్లాడదలచుకొన్నానురా. ఆ చిన్నదానికి కూడా సమాధానమేనురా. ఈలాంటి విషయంలో ఈ ముసలాయన సబబూ సందర్భమూ లేకుండా వచ్చి అంటారూ : ఆయనకా పిల్ల మీద మోహం ఉందట ! ఆయనే పెళ్ళాడుతారట ! చూడు, ఎంత విపరీతమో !

జగ్గ—నాన్నగారిది చాలా పొరబాటు.

సుంద—ఆయనకు వచ్చినన్ని ఏళ్లు ఎవరికి వచ్చాయి ? ఆ లాటి వాడు పెళ్లికోసం పేకులాడడం కంటే అసందర్భం ఉంటుందా? ముసలి కాలాన ముచ్చటలన్నట్టు ఆయనకు మోహమేమిటి ? పడుచువాళ్లు గదా ఆ లాటి పాట్లన్ని పడవలసిన వాళ్లు ?

జగ్గ—మీరు చెప్పింది సబబుగా ఉంది. మీరిక్కడే ఉండండి. నాన్నగారితో మాటాడిచూస్తాను. (ధనదాసు దగ్గరకు వెళ్లి ఆయనతో) అబ్బాయిగారు మీరు చెప్పినంత మూర్ఖపాకంలో లేరే. సబబుకు కట్టుపడేటట్టు కనిపిస్తున్నారు. మీ యెడల చూపించవలసిన భయభక్తి తాత్పర్యాలలో ఆయనేమీ లోపం చెయ్యరట. ఇందాక ఏదో వేళావిశేషంచేత అణుచుకోలేనంత కోపం వచ్చిందట గాని ఇకను మీరేం చెప్పుతారో దానికంతా చేతులు కట్టుకొని నడుస్తా

ాట. అయితే ఒకటీః మునుపటి కంటే ఆయనను ఎక్కువ దయతో చూడడానికిన్నీ, ఆయన కిష్టం లేని పెళ్ళాన్ని కట్టిపెట్టక పోవడానికిన్నీ మీరు మాట ఇస్తే చాలును.

ధన—జగ్గన్నా, ఈ లాగు వాడు దారిలోకి వస్తే వాడేం కోరినా కాదనకుండా చేస్తాను. రాధ తప్ప వాడికిష్టమైన పిల్ల ఎవరైనా సరే తెచ్చి పెళ్ళి చేస్తాను.

జగ్గ—అయితే మీరిక్కడే ఉండండి. అబ్బాయిగారితో మాటాడి వస్తాను. (సుందరం దగ్గరకు వెళ్ళి) నాన్నగారు మీరు చెప్పినంత మూర్ఖపాకంలో లేరే. సబబుకు కట్టుపడేటట్టే కనిపిస్తున్నారు. మీయెడల చూపించ వలసిన ప్రేమలో ఆయనేమీ లోపం చెయ్యరట. ఇందాక ఏదో వేళావిశేషంచేత అణుచుకో లేనంత కోపం వచ్చిందట గాని ఇకను మీ ఇష్టానికేమీ అడ్డు చెప్పరట. అయితే ఒకటీః మునపటి కంటే ఆయనకు మీ రెక్కువ లొంగి నడవడానికిన్నీ, ముసలివారు ఆయన చిరాకుచేత చిర్రుబుర్రుమంటే మీరు కొంచెం వస్తాయిస్తూ ఉండాలి గాని మీరు కూడా తలపొగరుగా తాటిప్రమాణం లేవక పోవడానికిన్నీ, మీరు మాట ఇస్తే చాలును.

సుంద—జగ్గన్నా, ఈలాగు ఆయన దారిలోకి వస్తే ఆయనేలాగు కోరుతారో అలాగు కాదనకుండా నడుస్తాను. రాధను విడవక పోవడంలో తప్ప తక్కిన అన్ని విషయాలలోను ఆయనకు నేను బద్ధుడనే.

జగ్గ—(అక్కడ నుంచియే ధనదాసుతో) అబ్బాయిగారు మీరు చెప్పిన వాటికన్నిటికీ తల ఊపినారు. మరేమీ చిక్కు లేదు.

ధన—నాకంత కంటే కావలసింది మరేమీ లేదు.

జగ్గ—(సుందరంతో) నాన్నగారు మీ మాటలకన్నిటికీ సహీ చేశారు. మరేమీ చిక్కులేదు.

సుంద—అయితే బ్రదికాను.

జగ్గ—ఇక మీరిద్దరూ కలిసి సఖ్యంగా ఈ సంగతి గురించి మాట్లాడుకొంటే మరేమీ మనోమాలిన్యాలు మిగిలి పోవు. చూచారా, ఇప్పుడు మీరింత సులువుగా సఖ్యపడి పోయారా? ఒక గడియ ముందు కత్తులూ కటార్లూ దూసుకొని కలబడి ఒకరినొకరు మింగివెయ్యా లనుకొన్నారు గదా? ఒకరి మాట ఒకరికి బోధపడక పోవడమే దానికంతా మూలం.

సుంద—జగ్గన్నా, నువ్వు చేసిన మేలు మరిచిపోను.

జగ్గ—అయ్యో! దానికేం లెండి! మీరూ మీరూ సార్లాగా ఉండడమే నాకు కావలసింది.

ధన—జగ్గన్నా, జుట్లూ, జుట్లూ ముడిపెట్టి చూచే నారదులేగాని, నీలాగు విప్పే వాళ్లు తక్కువ. నాకు చాలా సంతోషంగా ఉంది. నీకు తప్ప కుండా బహుమతి ఇయ్యాలి.

[ధనదాసు జేబు తడమును; జగ్గన్న చేయి చాచును; ధన దాసు కరకాయ ముక్క తీసి నోట వేసికొనును.]

ధన—జగ్గన్నా, ఇప్పటికి పో. నీ మాట మరచి పోను లే.

జగ్గ—చిత్తం. (తనలో) మెచ్చి మేకతోలు కప్పుతాడు కాబోలు! జేబులో నుంచి ఏమిటో తీసి ఇస్తాడని ఆశపడి నోరు వెళ్లబెట్టి కూర్చుంటే తన నోటిలో కరకాయ వేసుకొని, నా నోటిలో కరకాయ వేశాడు.

(నిష్క్రమింతురు.)

సుంద—నాన్న గారూ, తొందర పడ్డందుకు క్షమించండి; నాకు సిగ్గుగా ఉంది

ధన—అబ్బే! మరేమీ నీ మనస్సులో పెట్టుకోను.

సుంద—నాకు చాలా విచారంగా ఉంది; నమ్మండి నా మాట.

ధన—నువ్వు పొరపాటు ఒప్పుకోవడం చూస్తే నాకు చాలా సంతోషంగా ఉంది.

సుంద—నా అపరాధం మీరు ఇంత త్వరలో మరిచిపోవడం నా మీద ఉన్న దయ కొద్దీ.

ధన—పిల్లల తప్పులు తండ్రులు కాకపోతే మరెవళ్లు మన్నించే వాళ్లు ?

సుంద—అయితే నా అవకతవక సంభాషణకు మీకు నిజంగానే కోపం లేదా మనస్సులో ?

ధన—దారిలోకివచ్చి నువ్విలాగు విధేయతగా ఉంటే నా కోపం యేలాగు నిలుస్తుంది ?

సుంద—నాన్న గారూ, మీరిప్పుడు నాయెడల చూపించిన దయ జన్మమధ్యాన ఎప్పుడూ మరిచిపోవలసిన వాడను కానని నమ్మండి.

ధన—ఇక ముందు నువ్వేం కోరినా నేను చెయ్యవలసిన వాడనని నువ్వు నమ్ము.

సుంద—నాన్న గారూ, ఇంతకంటే నాకు మరేం కావాలి ? రాధను మీరు నాకు వదలి వెయ్యడమే మహాభాగ్యం.

ధన—ఏమిటీ ?

సుంద—మీరిప్పుడు నా కోరిక తీరుస్తానన్నారే, అదే పదివేలు. రాధను నాకు విడిచి పెట్టడమంటే లోకమంతా విడిచిపెట్టినట్టు.

ధన—రాధను నీకు విడిచి పెడతానన్న వాళ్లెవరు ?

సుంద—మీరే.

ధన—నేనా ?

సుంద—అవును మీరే.

ధన—ఏమిటీ, ఆ పిల్లను విడిచి పెడతానన్నవాడవు నువ్వు కావూ ?

సుంద—నేనా ?

ధన—అవును, నువ్వే.

సుంద—నేనెంత మాత్రమూ కాను.

ధన—ఆపిల్ల జోలి ఇక తలపెట్టనని నువ్వు కరారు చెయ్యలేదూ ?

సుంద—కరారు చెయ్యలేదు సరి గదా; ఆ పిల్లను నేను వదలడం కలలో వార్త కూడా అన్నాను కావలిస్తే.

ధన—హాత్ ! ఆకతాయి వెధవా, మళ్లీ కచ్చుకొంటున్నావా ?

సుంద—మీరెంత గింజుకొన్నా నా మనస్సు తిరిగేది కాదు.

ధన—వీపు దురద వేస్తుంది కాబోలు వెర్రి వెధవకు. వెధవా, నాకు దొరుకు ; చెమ్డాలెక్క గొడుతాను.

సుంద—మీ చేతనైన పని చేసుకోండి.

ధన—మాలవెధవా, ఇక నా గుమ్మంలో అడుగు పెట్టావంటే కాళ్లు విరగ గొడతాను.

సుంద—పెడితే అలాగే కొట్టండి.

ధన—నువ్వింక నా కొడుకువే కావు.

సుంద—పోనీండి.

ధన—ఇక నీ కోసం తల కడుగుకొంటాను.

సుంద—కడుగుకోండి.

ధన—ఇక నువ్వు నా ఆస్తికి హక్కుదారుడవు కావు.

సుంద—ఆలాగే కానీండి.

ధన—నీకు నా ఆస్తిలో వంతు పెట్టనుగాని, కావలిస్తే శాపాలు పెడతాను.
(నిష్క్రమించును.)

సుంద—మీరు పెట్టేవి నాకేవీ అక్కరలేదు.

(సొమ్ముపెట్టెతో రామన్న ప్రవేశించును.)

రామ—బాబు, బాబూ, ఆడబోయిన తీర్థ మెదురైనట్టు దొరికాను. రండి రండి నా వెంట వేగిరం.

సుంద—ఏమిటేమిటి, విశేషం?

రామ—రండి బాబూ, మాటాడకుండా. మనం బ్రదికి పోయాం.

సుంద—ఏలాగేలాగు?

రామ—ఇదిగో మీకు కావలసింది.

సుంద—ఏమిటేమిటి?

రామ—దీనికోసం ఈ వేళ్లా పొంచి పొంచి కాచాను.

సుంద—దేని కోసం?

రామ—మీ నాన్నగారు తోటలో పాతిన సొమ్ము. నిమ్మళంగా సాధించి తెచ్చాను.

సుంద—ఏలాగు సాధించావు?

రామ-రండి, అంతా చెప్పుతాను. మనం ఇక్కడనుంచి ఉడాయిస్తే సగాని ఆబోరు దక్కదు. రండి మరి. అదిగో మీ నాన్నగారి గొంతుక వినిపిస్తూ ఉంది.

[సుందరం, రామన్న, నిష్క్రమింతురు.]

[ధనదాసు తోటలోనుంచి అరచుచు పరుగెత్తుకొనివచ్చి
ప్రవేశించును.]

ధన—దొంగలు! దొంగలు! చోరీ! ఖూనీ! పట్టుకోండి, పట్టుకోండి. అయ్యో! దేవుడా, పట్టపగలే ఈ లాటి అన్యాయమా? అయ్యో! అయ్యో! ఇంకేముంది? నా ప్రాణం తీశారు; నా గొంతు కోశారు! నన్ను గోతిలో తోశారు; నాసొమ్ము కన్నం వేశారు. ఎవడురా భగవంతుడా, ఈ ఘోరం చేసిన వాడు? వాడేమయాడు? ఎక్కడికి పోయాడు? ఏ మూల దాగున్నాడు? ఏలాగు దొరుకుతాడు? హా! దైవమా, నేనెక్కడికి పరిగెత్తేది? ఎక్కడికి పరిగెత్తడం మానివేసేది? ఇక్కడ లేడా అదొంగ? ఇదిగో; ఇదెవ్వడు? పట్టుకో, పట్టుకో. (తనచెయ్యి తానే పట్టుకొని) దొంగ వెధవా, నాసొమ్ము తే...... అయ్యో! ఈ చెయ్యి నాదే........నాకు మతి పోతూ వుంది. ఇప్పుడెక్కడున్నానో, ఏం చేస్తున్నానో, ఎవరినో కూడా తెలియకుండా ఉంది. అయ్యో! సొమ్మా, నా ముద్దు సొమ్మా, నా రాజు సొమ్మా, నా బంగారు సొమ్మా, నీకూ నాకూ లంకె గదా, నువ్వు నా ప్రాణంతో సమం గదా, నువ్వే నాకు చుట్టపక్కాలకంటే ఎక్కువ గదా, నీకూ నాకూ ఎడబాపులు చేసేశారే, ఎలాగు బ్రదకడం? ఆహా! సొమ్మా, నువ్వు లేక పోవడం నాకు లోకం చీకటై పోవడమే; చెయ్యి విరిగి పోవడమే; ప్రాణంపోవడమే! లోకానికీ నాకూ ఇక ఋణమే చెల్లి పోయింది. ఇక నేను లోకంలో ఉండ వలసిన ప్రయోజనమే లేదు. సొమ్ము లేనిదీ నాకు బ్రతుకెందుకు? ఇక్కడికి నాకథ సమాప్తమయింది. ఇక నేనీ కష్టం సహించి ఉండలేను. నా ప్రాణం పోతూ ఉంది; ఇదిగో, పోనే పోయింది; నన్ను తగలేశారు. నా సొమ్మెక్కడుందో చెప్పి, నాకు తిరిగి ప్రాణం పోసే పుణ్యాత్ము లెక్కరూ లేరా? ఏమిటీ, ఏమంటున్నారు? అయ్యో! ఎవరూ

లేరే. నా గుండె దడదడలే కాబోలు. ఎవరో మాటాడినట్టు వినిపించింది? అయ్యో! అయ్యో! అయితే నా సొమ్ము పోయినట్టేనా? ఎవరు చేశారో గాని ఈ చోరీ సందు కనిపెట్టే చేశారు. దుర్మార్గపు వెధవ నా కొడుకుతో మాటలాడుతూ ఉన్నప్పుడే ఇంత కొంప మునిగింది. ఇక నేను వెళ్లాలి; వెళ్లి, పోలీసు వాళ్లను పిలుచుకు వచ్చి, నా ఇంట్లో వాళ్లనందరినీ,—అనగా, నా నౌకర్లనూ, చాకర్లనూ, కొడుకునూ, కూతురినీ, నన్నూ—కొట్లో పెట్టించి, కుల్లు పోట్లు పొడిపించి, అడిగిస్తాను. (వీధిలోకి వచ్చి) ఆహా! ఎంత మంది మనుష్యులిక్కడ మూగారు! వీళ్లందరూ దొంగల లాగే కనబడుతున్నారు. అగపడ్డ వాళ్లందరి మీదా అనుమానం తట్టుతూ ఉంది. ఆహా! అక్కడేమిటో గుసగుసలాడుతున్నారు; నా సొమ్ము గురించే కాబోలు? అదిగో, మీదేదో చప్పుడౌతూ ఉంది; దొంగ అక్కడ దాగున్నాడు కాబోలు? ఓ తండ్రులారా, తల్లులారా, మీ కడుపులూ కాళ్లూ పట్టుకు బ్రతిమాలుకొంటాను; దొంగెక్కడున్నాడో చెప్పండి, మీకు పుణ్యం వస్తుంది. మీ మధ్య దాగున్నాడేమో చెప్పండి. అయ్యయ్యో! వీళ్లందరూ నన్ను చూచి నవ్వుతూ ఉన్నారే. వీళ్లందరూ కుమ్మక్కు చేసే దొంగతనం చెయ్యించి ఉంటారు. కొట్లో పెడితే అప్పుడే తేలుతుంది. ఎవరక్కడ? కనిష్టేబులు, సబ్బినస్పెక్టర్లు, ఇనస్పెక్టర్లు, సూపరెంట్లు, మేజిష్ట్రేట్లు, జడ్జీలు, కలక్టర్లు, అందరూ వేగిరం రండి. వీళ్లనందరినీ ఉరి తియ్యించండి. అక్కడికీ సొమ్ము దొరకక పోతే ఆతరువాత నేనే ఉరి పెట్టుకొంటాను.

(నిష్క్రమించును.)

---

## V అంకము.

[ధనదాసు, ఒక సబ్బినస్పెక్టరు, ప్రవేశింతురు.]

సబ్బి—అదంతా నాకు విడిచి పెట్టండి. దర్యాప్తు చెయ్యడం మోస్తరు నేను బాగా ఎరుగుదును. దొంగలను పట్టుకోవడం ఇది నాకు మొదటి దఫా కాదు. నేనెందరు మనుష్యుల కురిశిక్షచెప్పించానో అన్ని సంచుల రూపాయిలు నాకుంటేనా?

ధన—అయ్యా! సబ్బినస్పెక్టరుగారూ, ఆ రూపాయిలకేం? పోయిన నా రూపాయిల మాట ఏం చెప్పుతారు? ఈ జిల్లాలో ఉన్న సబ్బినస్పెక్టర్లల్లా ఈ కేసు దర్యాప్తు చెయ్యవలసి ఉంటుంది. సొమ్ము గాని దొరకక పోయిందా, కోర్టువారి మీదే దావా తెస్తాను.

సబ్బి—తగిన ఏర్పాటులన్నీ చేదాం. అన్నట్టు, పెట్టిలో ఎంత సొమ్ముందో చెప్పారు కారు.

ధన—వెయ్యి రూపాయిల నగదు.

సబ్బి—వెయ్యి రూపాయిలే.

ధన—అవును; వెయ్యి రూపాయిలు; పది వందలు; వంద పదులు; వెయ్యి ఒకట్లు.

సబ్బి—పెద్ద చోరీయే.

ధన—నింపాదిగా అంటారు. ఇంత గొప్ప తప్పితం చేసిన వాడికి ఎంత ఎక్కువ శిక్షయినా చాలదు. ఇది శిక్షించక పోతే లోకంలో న్యాయమే లేదన్న మాట.

సబ్బి—అన్నీ రూపాయిలేనా? ఏమైనా చిల్లరుందా?

ధన—అన్నీ తెల్లటి—కొత్త—రాణీ ముద్ర—రూపాయిలు.

సబ్బ—మీ కెవరి మీద అనుమానం ఉంది?

ధన—అందరి మీదనూ. ఈ పట్టణంలో ఉన్న యావన్మందినీ, చుట్టు పక్కల గ్రామాలలో ఉన్న వారినీ, కూడా కొట్టులో పెట్టవలసి ఉంటుంది.

సబ్బ—అదిగో, మీ రాలాగు తొందర పడకండి. ఎవరినీ బెదర గొట్ట కుండా మంచితనం చేతనే కూబీలు లాగి, సాక్ష్యం సంపన్నం జతపరి చామంటే తరవాత చోరీ ఆస్తి సులభంగా దొరుకుతుంది.

[సోములు వెనుకకు నడుచుకొనుచు వచ్చి రెండు దీపములు వెలిగించి నిష్క్రమించగా, ధనదాసు ఒకటి ఊదివేయును. జగ్గన్న రెండవ వైపునకు ముఖము త్రిప్పి మాటాడుచు ప్రవేశించును.]

జగ్గ—ఇదిగో, ఇప్పుడే వస్తాను. ఇంతలో ముక్క ముక్కల కింద తెగగండి. సలసల మరుగుతూ ఉన్న నీటిలో వేసి పైతొక్కంతా వలచండి.

ధన—(ఆతురముతో) ఏమిటి, దొంగ నేనా? దొరికాడా ఏమిటి?

జగ్గ—మీ గుమస్తా కర్రపెండ్లం దుంపలు కొన్నాడు లెండి. అవి కూర వండుతున్నాను.

ధన—అది కాదిప్పుడు కావలసిన సంగతి. ఇదిగో, వీరితో నువ్వు మరొక విషయమై మాటాడవలసి ఉంటుంది.

సబ్బ—(జగ్గన్నతో) భయపడకు. నేనెవళ్లతోనూ ఏమీ వెల్లడి చెయ్య వలసిన వాడను కాను. ఏమీ అల్లరయి పోకుండా అక్కడికక్కడే సరుదుకుంటాను.

జగ్గ—ధనదాసు బాబూ, వీరిని గానీ భోజనానికి పిలిచారా ఏమిటి ?

సబ్బ—ఇదిగో అబ్బీ, ఇందులో నువ్వేమీ దాచ కూడదు.

జగ్గ—దాచనండి. అసలు తెచ్చిన పదార్థాలే తక్కువ; ఇక దాస్తే ఏలాగు? ఆ పదార్థాలు ఎంత బాగా తయారు చెయ్యడానికి వీలో అంత బాగా తయారు చేస్తాను, చూడండి నా నేర్పు.

సబ్బ—అది కాదు నా అభిప్రాయం.

జగ్గ—అంత కంటే ఎక్కువ పదార్థాలు నేనెక్కడి నుంచి తెచ్చేది ? గుమాస్తా ఎక్కడికక్కడే తోక కోసేస్తూ డెక్కాడ నియ్యకుండా ఉన్నాడు.

ధన—వెధవా, భోజనం సంగతి కాదోయి, మేమిప్పుడు మాటలాడుతూ ఉంది ? నా దగ్గిర దొంగలాడిన సొమ్ము మాటేమయిందో చెప్పు.

జగ్గ—మీ సొమ్ము దోపుడు పోయిందా !

ధన—అవునురా వెధవా, నువ్వే దొంగలాడావు. తిన్నగా ఇస్తే ఇచ్చావు ; లేకపోతే ఉరి తియ్యించేస్తాను.

సబ్బ—ధనదాసుగారూ, ఇతడిని బెదరగొట్టకండి. ఇతడి ముఖం చూస్తే దొంగలాగు కనబడడం లేదు. మీరు గాని తొందర పెట్టక పోతే, కోర్టులోకి వెళ్ల వలసిన అవసరం లేకుండా మీకు కావలసిన సంగతంతా చెప్పుతాడు. అవునోయి జగ్గన్నా, ఉన్నదున్నట్టు చెప్పేశావంటే, నీకేమీ చిక్కురాదు. మీ యజమానుడి దగ్గిరనుంచి మంచి బహుమానం కూడా కొడతావు. ఈయన సొమ్ము చోరీ పోయిన సంగతి కేవలమూ నీకు తెలియకుండా జరిగి ఉండదు.

జగ్గ—(తనలో) గుమస్తా మీద నాకున్న అక్కసంతా తీర్చుకోవడానికి ఇదే మంచి అవకాశం. అతడిక్కడికి వచ్చిన దగ్గిరనుంచీ అతడ మాటే కాని మరి మా ఎవరి మాటా ఎక్కడమే లేదు. అదీ గా.

ఇందాకిందాక నా గూబలు వాయించాడు కూడా గదా ? ఇప్పటికీ గూబలు గియ్యిమంటున్నాయి.

ధన—ఏమిటాలాగు నోటిలో సణుగుకొంటున్నావు ?

సబ్బ—ధనదాసుగార్వూ, ఇతడిని బేజారు పెట్టకండి. ఉన్నదంతా చెప్పే యాలనే కూడబలుకుకుంటున్నాడు. మంచి పెద్దమనిషని మొదశే నేనన లేదూ ?

జగ్గ—బాబూ, నాకు తెలిసినదేమిటో చెప్పమంటున్నారు కాబట్టి ఈ దొంగతనం గుమస్తా దెబ్బే అని నానమ్మకం.

ధన—(ఆశ్చర్యముతో) బలరాందా ?

జగ్గ—అవునండి.

ధన—ఎంతో నమ్మకమైన వాడి లాగున కనిపించే వాడే ?

జగ్గ—దొంగవేషాలు. అతడే మీసొమ్ము దొంగలాడాడని నాకు గట్టి నమ్మకం

సబ్బ—ఏమిటి, నీనమ్మకానికి కారణం ?

జగ్గ—ఏం కారణమా ? నానమ్మకానికి ఏమిటా కారణం ?

సబ్బ—అవును, చెప్పు.

జగ్గ—నేనాలాగు నమ్మడానికి కారణం—నేనాలాగు నమ్మడమే.

సబ్బ—అలాగంటే చాలదు. నీ నమ్మకానికి సబబులు చెప్పాలి.

ధన—నేను సొమ్ము దాచిన దగ్గిర అతడు తారుతూ వుండడం గానీ నువ్వు చూశావా ?

జగ్గ—అవునండి. ఎక్కడా మీరు సొమ్ము దాచారు?

ధన—తోటలో.

జగ్గ—అవును, సరీగా తోటలోనే అతడీ వేళల్లా తారాడు. దేనిలోను మీరు సొమ్ము పెట్టారు ?

ధన—పెట్టిలో.

జగ్గ—ఆ, అవునదే. అతడి చేతిలో పెట్టి ఉండడం కూడా నేను చూచాను.

సబ్బ—ఆ పెట్టి ఏలాటిది.

జగ్గ—ఏలాటిదా ?

సబ్బ—అవును, చెప్పు.

జగ్గ—అది ఏలాగుంటుందంటే,—సరీగా పెట్టి లాగుంటుంది.

సబ్బ—నిజమే కాని, మరి కొంచెం స్పష్టంగా చెప్పు. పోల్కులు తగుతాయేమో చూదాం.

జగ్గ—పెద్ద పెట్టి—

ధన—నాది చిన్న పెట్టి ?

జగ్గ—పెద్ద పెట్టంటే, దానిలో ఉన్న సొమ్ము విలువ బట్టి పెద్ద పెట్టన్నాను. కొలతను బట్టి చూస్తే అది తప్పకుండా చిన్న పెట్టే.

సబ్బ—దాని రంగేమిటి ?

జగ్గ—రంగా?

సబ్బ—అవును, చెప్పు.

జగ్గ—దాని రంగేలాటిదంటే—అదొక మోస్తరు రంగు.—ఆ రంగు పేరేమిటో నాలుక మీద ఆడుతూ ఉంది. ఎవరూ చెప్ప లేరూ ?

ధన—(దగ్గును).

జగ్గ—(ధనదాసు వైపు తిరిగి) ఎరుపని కదూ అన్నారు?

ధన—కాదు, బూడిద రంగు.

జగ్గ—ఆఁ, అవును ; ఎరుపు కలిసిన బూడిద రంగు. అదే నా అభిప్రాయం.

ధన—సబ్బినస్పెక్టరుగారూ, ఇకేమీ అనుమానం లేదు. వీడు చెప్పిన పోల్కులన్నిటి బట్టీ అది నా పెట్టే. వీడి దగ్గిర వాంగ్మూలం కట్టుకోండి

ఓ. భగవంతుడా, ఇక ఎవ్వరిని నమ్మడానికి వీలుంది ? ఇదమిత్థమని ఇక లోకంలో ఏదీ నిశ్చయంగా చెప్పలేం. నా సొమ్ము నేనే దొంగలాడినా అదొక ఆశ్చర్యంలోది కాదని ఇక నమ్మవచ్చును.

జగ్గ—ధనదాసుగారూ, అదుగోనండి వస్తున్నాడు, నోటిలో వేలు పెట్టితే కొరవ లేనట్టు మీ గుమస్తా. బాబూ, ఈసంగతి నేను చెప్పానని మాత్రం అతడితో అనకండేం, కొంపతీసి.

(బలరాం ప్రవేశించును.)

ధన—ఓ బలరాం, ఇలా రా. (గుండె బాదుకొనుచు) అబ్బా! ఎంత గుండెలు తీసిన పని ! ఎంత నమ్మకస్వామిద్రోహం ! లోకంలో ఎవర్లైనా ఎప్పుడైనా ఈ లాటి ఘోరం చేసి ఉంటారా ?

బల—ఏమిటండీ వీరాంటూ ఉంది ?

ధన—ఛీ, సిగ్గు సిగ్గులేక అడుగుతావా, ఈ లాటి దొంగ పని చేసి కూడా? ఇంకా మొగ మెత్తుకొని ఏలాగు తిరుగుతున్నావు?

బల—(తనలో) కమలను నేను దొంగతనంగా పెళ్లాడిన సంగతి అప్పుడే ఈయనకు తెలిసిందా ఏం, చెపుమా ?

ధన—ఏం, పెల్లం కొట్టిన రాతి లాగు ఉలకక పలకక ఊరుకున్నావు ?

బల—ఏమిటి, నేను చేసిన దొంగపని?

ధన—ఛీ, అడగడాని సిగ్గు లేదూ ? ఏదొంగపనో ఎరగనట్టే. ఎందుకీ దొంగేషాలు? ఎంత తంటాలు పడ్డా ఇక దాగదు. గంటుతనమూ దొంగతనమూ దాగవన్న సామెతే ఉంది. సంగతంతా అప్పుడే నేను విన్నాను. ఛీ, విశ్వాసఘాతుకుడా, ఇన్నాళ్లయి నేను చూపిస్తూ ఉన్న దయకిదేనా ఫలితం? పాలు తాగి రొమ్ము గుద్దుతావా? తిన్న ఇంటనే వాసాలు లెక్క పెట్టేవాడవు కాక పోతే, ఈ లాటి అక్రమం చెయ్యాలన్న

దురూహతో నా ఇంట ప్రవేశిస్తావా? సందు చూచి నా గొంతు కోలాగు కోస్తావా?

బల—అయ్యా, అంతా మీకు తెలిసినట్టే ఉంది కాబట్టి దాపరికం ఎందుకు! చేసిందేదో చేశాను.

జగ్గ—(లోనలో) ఓహో! మిడతంభొట్ల శకునం ఫలించినట్టుందే!

బల—మీతో ఈ సంగతి చెప్పుదామనే సమయం కోసం కనిపెట్టుతూ ఉన్నాను. మీకేలాగూ తెలిసే పోయింది కాబట్టి, ఇక నేను చెప్ప బొయ్యే కారణాలు వినండి.

ధన—ఛీ, గజదొంగా, చేసిన దొంగ పనికి కారణాలు కూడానా? ఏమిటో ఆ కారణాలు?

బల—అయ్యా, మీరీలాగనడానికి నేను తగను. మీ విషయంలో నేను తప్పు చేశానన్న మాట నిజమేగాని, మీరింత నీచపు మాటలు నన్నన వలసినంత ఘోర తప్పితం కాదు, నేను చేసింది.

ధన—కాదేం? ఎత్తుల మీద ఎత్తులు వేసి చేశావే.

బల—అయ్యా, కోపం అణుచుకోండి, మిమ్మల్ని బ్రదిమాలుకుంటాను. నేను చెప్పినదంతా విన్న తరవాత నా నేరం అంత ఘోరమైనది కాదని మీకే బోధ పడుతుంది.

ధన—బోధపడుతూ ఉంది నీ మైరావణ చర్య. తన నేరం ఘోరం కాదట! నా కడుపు కాల్చావే? నా కొంప కూల్చావే?

బల—అయ్యో! అయ్యో! అపృచ్ఛపు మాటలాడకండి. మీ కడుపు కాలడమేం? నూరేళ్లూ మీ కడుపు చల్లగా ఉండాలనే నా కోరిక. మీ కొంప కూల్చానంటున్నారు; మీ కొంప నిలపాలనే నా ప్రయత్నం. మీరాగ్రహించడానికి నేనేం కులం తక్కువ వాడను కానే. మీకు తెలియకుండా దొంగపని జరిగించినందుకు నష్టం కలిగిందని మీకు

నోచి, మీ రేమైనా ముజరా కోరే పక్షానికి అది చేతులు జోడించి ఇచ్చుకొంటాను.

ధన—నష్టం కలిగిందని నాకు తోచ వలెనా? ఏం చమత్కారం మాటలు! దొంగలాడిన సొత్తు తిరిగీ తెచ్చి నా ఎదట పెట్టు.

బల—ఎదట పెట్టడమే కాదు, కాళ్ల మీదే పడవేస్తాను, క్షమిస్తానని అభయహస్తం ఇయ్యాలి.

ధన—మొదట తెస్తేనే గాని ఏమీ చెప్పను. అయితే ఈ లాటి దొంగపని ఎందుకు చేశావు?

బల—అయ్యో! అడుగుతారా?

ధన—అడుగుతానా? అడిగి చూస్తానా?

బల—నాచేత ఈ దొంగపని చెయ్యించిన వాడు స్త్రీపురుషులందరినీ గజగజలాడించే దేవుడు.



ధన—వాః! ఏం మెట్టవేదాంతం!

బల—అయ్యో! మోహం కలిగిన తరవాత ఏం చేసినా చెయ్యవలసే వస్తుంది

ధన—మోహమా?

బల—అవునండి.

ధన—వహవ్వా! మంచి మోహమే! నా సొమ్ము మీదే మోహమా?!

బల—అదిగో, ఆ పొరపాటే పడకండి. మీ ధనానికి ఆశించిన వాడను కాను. మీ కాసుల మూటలు చూచి నా కళ్లు చెదర లేదు. మీ దగ్గర నేను సొత్తు దొంగలాడానంటున్నారే, ఆ సొత్తు ఒక్కటీ గాని మీరు నాకు విడిచి పెట్టడానికి సమ్మతించే పక్షానికి, తక్కిన మీ సొత్తేదీ నేను కోరవలసిన వాడను కానని మీరు గట్టిగా నమ్మ చ్చును.

ధన—దెయ్యం పట్టింది కాబోలు మనిషికి! ఇప్పుడు దొంగలాడిన సొత్తు మట్టుకు విడిచి పెట్టాలట! ఏం నంగనాచితనమే! దొంగలాడడమే కాకుండా దొంగలాడింది వదిలి పెట్టమనడం కూడానా? గడుసుతనం ఏమీ ఎరగదు, పాపం!

బల—దీన్ని దొంగతనమంటారా?

ధన—దీన్ని కాకపోతే మరి దేనినంటారు దొంగతనమని? ఈ మాత్రం ఆ మాత్రం సొత్తా?

బల—అవును, చాలా ఎక్కువైన సొత్తే, నేనూ ఒప్పుకొంటాను. అయితే ఆ సొత్తు నాకు విడిచి పెట్టడం వల్ల మీకేమీ నష్టం రాదే. ఈ అందాలపెట్టె నొక్కదానినీ నాకు వదిలి పెట్టండి, మీ పుణ్యం ఉంటుంది. మీ పాదాలమీద పడతాను.

ధన—వదిలేస్తానే? అలాగే మొద్దువు గాని. అందాలపెట్టని హోషక్ పడ్డావే?

బల—పడకే నావశమా? అందుచేతనే అంత తొందరపడి ముడి పెట్టుకోవడం.

ధన—ముడి పెట్టుకొన్నావా? మెడకు కట్టుకొన్నావా?

బల—ముడి పెట్టుకొన్నానో, మెడకు కట్టుకొన్నానో, ఇక ఎడబాపులు చెయ్యడానికి మాత్రం ఎవరికీ వీలులేదు.

ధన—ఎడబాపులట! హాస్యం భోంచేస్తున్నావా? ముడే పడిపోతే తాడు తెంపడానికి నేనున్నాను; మెడకే కట్టుకుంటే ఉత్తరించడంలో నాకు చాలా నేర్పుంది.

బల—అయితే పాపానికొడిగట్టుకుంటారా?

ధన—పాపమేం? ఇదే పాపమనిపించుకొంటుందో నా సొమ్ము కాశపడడమే పాపమనిపించుకొంటుందో?

బల—అయ్యో ఇంతకు ముందే చెప్పానే, మీసొమ్ము కాశపడి కాదు నేనీ పని చెయ్యడమని.

ధన — అయితే నా మేలు కోరి చేశానంటాడు కాబోలు ఈదొంగతనం! ఉపకారంగా అలికి చీర కొనిపెట్టడాన్ని మించి పోతూ ఉందే! ఛీ దొంగా, దేనికాశపడి ఈ పని చేశావో కోర్టువారే పరిష్కరిస్తారు ఉండు.

బల — ఇక మీచిత్తం. మీరేపాట్లు పెట్టినా పడడానికి నేను సిద్ధంగానే ఉన్నాను. అయితే ఒకటి : ఇప్పుడు జరిగిపోయిన కార్యం అక్రమంగానే మీరాలోచించే పక్షానికి, ఆ అక్రమం అంతా నాదే; మీ కొమార్తె దోషం చిన్నమెత్తయినా ఇందులో లేదు.

ధన — ఎందుకుంటుంది ? నా కూతురే నా విషయంలో ఈ లాగు అక్రమంగా నడుస్తుందా? అయితే అందాలపెట్టి అందాలపెట్టన్నావే, దానినెక్కడికి నడిపావు ?

బల — ఎక్కడికీ నడపలేదు ; ఇంట్లోనే ఉంది.

ధన — (తనలో) భగవంతుడా, బ్రదికాను. పెట్టెంకా ఇంట్లోనే ఉందట ! (ప్రకాశముగా) అయితే నా సొత్తు నా ఇంట్లోనుంచి నడిచి పోనే లేదా ?

బల — లేదండి.

ధన — (తనలో) అంతవరకూ అదృష్టవంతుడనే. (ప్రకాశముగా) ఇంకొకటి చెప్పు : తొందరపడి ఏమైనా చిల్లర —

బల — ఎంతమాటన్నారు ! తొందరపడి చిల్లర చేష్టలకు దిగడమే. మనస్సులో అభిలాష ఎంత ఉద్ధృతంగా ఉన్నా అదంతా అణుచుకున్నాను గాని, మరేమీ తొందరపడ లేదు; నమ్మండి నామాట.

ధన — (తనలో) మరీ అదృష్టవంతుడనే. సొమ్మేమీ చిల్లర పెట్టివెయ్యలేదట

బల—మనోవాక్కాయకర్మలలా నేనేమీ చెయ్యలేదు. కాక చిల్లరపనుల కేలాటి చోట బుద్ధి పుడుతుంది? సిగ్గున్న చోట చిల్లర పనులుండవను కోండి.

ధన—(తనలో) నా పెట్టిలో సొమ్ముతీసి చిల్లర చేశేయడానికి సిగ్గా? దొంగ లాడడానికి లేకపోయిందే? వీడి సిగ్గు బుగ్గయినట్టే ఉంది.

బల—ఆ అందాల పెట్టిని ఎదట పెట్టుకొని వట్టిచూపులు చూడడం తప్ప మరి మీద చెయ్యయినా వెయ్యలేదు. ఎందుచేతని అడుగుతారా, ఆ అందాల పెట్టి తన వాలుచూపులతో తిరిగి నన్ను చూస్తూ ఉండడమే నాకు బ్రహ్మానందమనిపించింది.

ధన—(తనలో) నా పెట్టికి వాలుచూపులొకటా? వెర్రి కుదిరింది, ఇక రోకలి తలకు చుట్టుకోవడమే తక్కువ. ఇందాక ముడిపెట్టుకోవడమన్నా డు; ఇప్పుడు వాలుచూపులంటాడు. పెట్టి స్త్రీసమం చేసి, వర్ణనా చాతుర్యం వినికిడి చేస్తున్నాడు కాబోలు!

బల—జరిగిన సంగతంతా గారికి తెలుసును.

ధన—మా దాసీదేనా! దానికేం పోగాలం, ఈ కుట్రలో కలియడానికి?

బల—నాకున్న అభిలాష చూచి జాలిపడి అది మీకుమార్తెకు బోధపరిచి, ఈ కార్యానికి ఒప్పించింది. మేం దొంగతనముగా కథ నడిపినప్పుడు అది కూడా ఉంది?

ధన—(తనలో) అయితే నా కూతురు కూడా కుట్రలో ఉన్నట్టేనా? ఓయి దేవుడా, ఇకెవ్వరిని నమ్మడం? అయినా తిన్నగా కనుకుందాం. (ప్ర కాశముగా) ఏమిటి, నా కూతురు గురించి చెప్తూ ఉన్నావు, తలా తోకా లేనికథ?

బల—నిజం కథేనండి. అయితే ఒకంతట మాత్రం ఒప్పుకుంది కాదు. బోధపరచ గా బోధపరచగా చివరికేలాగైతేనేం సగం సిగ్గులో ఒప్పుకొంది.

ధన—దాని సిగ్గు చిమిడినట్టే ఉంది; సిగ్గు మాలిన గుంట! అయితే అదీ నువ్వూ తోడుపెట్టుకొని నడిపేశారా పెట్టిని?

బల—ఏపెట్టినండి?

ధన—ఇంత సేపూ చెప్పావు కావూ, అందాల పెట్టి అందాల పెట్టంటూ, దాని నే.

బల—అందాలపెట్టంటే మీ అమ్మాయి. ఆపిల్లమీద నాకున్న అభిలాష కొద్దీ; నన్నుదొంగతనంగా పెళ్లాడడానికి మెడలు విరిచి ఏలాగో ఒప్పించి, ఈ సాయంకాలమే మంచి ముహూర్తం ఉండడంచేత, పొరుగింటి బ్రాహ్మడిచేత పౌరోహిత్యం చెయ్యించి, టూకీగా పెళ్లి తంతంతా నడిపించి, మూడుముళ్ళూ వేశేసినాను.

ధన—ఏమిటీ! — ఎప్పుడు వీలిచ్చింది, ఇంతఘోరానికి? నా కొడుకుతో నేను మాటలాడుతూ ఉన్నప్పుడా?

బల—అవునండి, మామగారూ, అప్పుడే.

ధన—అప్పుడే మామనా? నాకల్లుడొకడా? రేపుపొద్దుట మనమడొకడు లేస్తాడు కాబోలు! ఇవన్నీ నాకు తెలియకుండా నేనా?

జగ్గ—సబ్బినస్పెక్టరుగారూ, రాయించండి, రాయించండి.

సబ్బు—ఏమని?

ధన—ఏమనా? నా సొమ్ము దొంగలాడాడనీ, నా కూతురిని లేవదీశాడనీ.

జగ్గ—అవును; దొంగనీ పోకిరీ అనీ రాయండి బాబూ, రాయండి.

బల—ఈలాటి అపవాదలకు నేను తగను. నా పుట్టుపూర్వోత్తరాలన్నీ మీరు విన్నతరవాత—

[కమల, రాధ, పాప, ప్రవేశింతురు.]

ధన—(కమలతో) ఛీ దుర్మార్గురాలా, చండాలురాలా, నాకడుపు చెరప బుట్టినావు. నీకు నూరి పోసిన బుద్ధులన్నిటికీ ఇదేనా ఫలితం? గజదొంగ గాడిదెను కట్టుకొంటావా? తండ్రి అనుమతి అక్కరలేదూ? అనుభవిద్దురు గాని ఉండండి దీని ప్రతిఫలం. కొత్తపెళ్లికొడుకూ పెళ్లికూతురూ లాగు అచ్చట్లూ ముచ్చట్లూ అనుభవిస్తూ కులకాలను కొన్నారు కాబోలు! కాళ్ళూ చేతులూ కలియకట్టి, ఒసేవు కమలా, నీకు చీకటికొట్టు ప్రాప్తి; ఒరేవు బలరాం, నీకు ద్వీపాంతరంప్రాప్తి.

బల—మీరీలాగు కోపంతో ఉన్నప్పుడు ఏమన్నా అదొక లెక్కలోదికాదు. మీకోపం చల్లారిన తరవాత సావకాశంగా నేను చెప్పేదంతా విని అప్పుడేమంటారో అనండి.

ధన—ద్వీపాంతరమాఅన్నాను? నిన్ను ఉరికొయ్యఎక్కించనిదే నేనునిద్రపోను.

కమ—(ధనదాసు కాళ్లమీదపడి) నాన్నగారూ, కొంచెం కనికరం వహించండి, మిమ్మలిని బ్రతిమాలుకొంటాను. తండ్రిని కదా అని అదేపట్టు పట్టుకుకూర్చుంటే, కార్యం బొత్తిగా చెడగొట్టినవాళ్లవుతారు. నామాట విని ఈ ప్రథమకోపంమీద ఏమీ తొందరపడకండి; వెనకనుంచి నింపాదిగా ఆలోచించండి. ఇప్పుడెవరిమీద ఈ లాగెగురుతూ ఉన్నారో, ఆయనసంగతి కొంచెం బోగట్టాచెయ్యండి. ఆయన మీరనుకున్నట్టు కేవలం గుమస్తా మాత్రం కారు. ఆయనే లేక పోతే మీకు నేను అసలే దక్కక పోయి ఉందును. ఆలాటి వారిని నేను పెళ్లాడడానికి ఒప్పుకోవడంలో చిత్రమేమిటుంది? నాన్నగారూ, వీరే నాకు నన్ను నీటిగండం నుంచి తప్పించిన పుణ్యాత్ములు; మీ కూతురిప్రాణం నిలిపిన మహాత్ములు వీరే.

ధన—ఈ సోదంతా ఎవరికి కావాలి? ఇప్పుడు నువ్వీలాంటి పని చెయ్యడం కంటే అప్పుడు నిన్ను మూడు ముక్కలూ తాగి బుడుంగున మునిగిపో నిస్తే బాగుండి పోను.

కమ—నాన్నగారూ, నా ముద్దు చెల్లించండి.

ధన—నీ ముద్దు ముక్కలు చేస్తాను, ఉండు. సబ్బినస్పెక్టరుగారూ, కోర్టులో కథంతా నడవ వలసిందే.

జగ్గ—(తనలో) గుమాస్తానన్న గోటుతో గూబలు నులుపుతావు గదూ? దెబ్బకు దెబ్బ తీశానా! పిప్పూవడ దీస్తానుండు.

పాప—ఆహా! అంతా ఎంత చిక్కుగా తేలింది.

[ముసలయ్య ప్రవేశించును.]

ముస—ధనదాసుగారూ, ఏమిటిదంతాను? మీరేదో గందరగోళంలో ఉన్నట్టున్నారు.

ధన—ముసలయ్యగారూ, దయచెయ్యండి. ముసలయ్యగారూ, నాలాటి దుర దృష్టవంతుడిని మీరు మరి చూడబోరు. పాపం! మీరు ప్రధానానికి కాబోలు వచ్చారు? ఇంకేం ప్రధానం? ఎంత చిక్కుకింద తేలిందో మీ రూహించనైనా లేరు. నాసొమ్మూ చోరీపోయింది; నా కుటుంబ గౌరవమూ గంగలో కలిసింది. అడుగో, అక్కడ నిలబడి మహాపెద్దమనిషి లాగు మిడుతూ మిడుతూ చూస్తున్నాడే ఆ దొంగే, ఆ పోకిరే, నౌకరు లాగు నాఇంట్లో ప్రవేశించి నక్కవినయాలు కనబరచి కనబరచి, చివరికి నా సొమ్ము దొంగలాడాడు; నా కూతురిని లేవదీశాడు.

బల—నా సొమ్ము సొమ్మంటూ అదే పలవరిస్తున్నారు; మీ సొమ్మేమి కరుగుతుంది?

ధన—ముసలయ్యగారూ, ఈ సాయంకాలమే వాళ్లిద్దరూ దొంగతనంగా ముడి పెట్టుకొన్నారు. ఇందువల్ల మీకూ అగౌరవం జరిగింది గదా ? అందుచేత ఈ విషయంలో మీరే వాదులై దావా తెచ్చి, ఎంత ఖర్చైనా సరే మూడు కోర్టులూ తిప్పి మూడు చెరువుల నీళ్లూ తాగించాలి.

ముస—మీ కుమార్తె ఇంకొకరి మీద ఇషపడి వివాహం చేసుకొన్నందుకు నాకు విచారమేమీలేదు. ఎవరినీ బలవంతంగా పెళ్లి చేసుకోవడం నా ఉద్దేశమే కాదు. ఇంకొకరిమీద మనసున్న చిన్నదానిని వివాహం చేసుకొని ఏం సుఖపడతాను ముందుకు ? అది అలాగుండనియ్యండి. ఇందులో మీకన్యాయమేమయినా జరిగిందేమో చెప్పండి. శక్తి వంచన లేకుండా ఏ సహాయం కావలిస్తే ఆ సహాయం చేస్తాను.

ధన—ఇవుగోనండి, వీరు సబ్బినస్పెక్టరుగారు. చాలా న్యాయమైన వారు. తాము చెయ్యవలసిన పనిలో ఏలోపమూ లేకుండా దావా అంతా నడిపిస్తామని వీరు మాట ఇచ్చారు. అయ్యా, సబ్బినస్పెక్టరుగారూ, మరి గ్రంథం ఎక్కించి కథ నడిపించండి. ఇదిగో, ఈ ముసలయ్యగారు ఖర్చులన్నీ భరిస్తారు.

బల—అయితే ఏమని దావా? మీ కుమార్తెమీద మోహం ఉండడమూ, ఆ మోహంచేత ఆమెను నేను పెళ్లాడడమూ, ఇవే నేరాల కింద వస్తావో నాకు తెలియకుండా ఉంది. నేనెవరినో విన్నతరవాత—

ధన—ఆ కల్పనాకథలన్నిటితో నాకు ప్రసక్తిలేదు. ఈ కాలంలో ఈలాంటి వేషధారులకు లెక్కలేకుండా ఉంది. గొప్పింటి బిడ్డలమని చెప్పకొంటూ, మైరావణుడికంటే మాయలు తెలిసిన వాళ్లు లక్షోపలక్షలు.

బల—అయ్యా, బొకరికిపుట్టి ఒకరికి పుట్టానని చెప్పుకొనేటంత చండాలుణ్ని కానని నమ్మండి. కటకంలో ఎవళ్ల నడిగినా చెప్పతారు నాపుటుక గురించి.

ముస- అబ్బాయి, కొంచెం జాగ్రతగా మాటలాడు. కటకపు సంగతులన్నీ నాకు కంఠతా వచ్చినట్టు తెలుసును. ఏ మాత్రం తపావతు వచ్చినా దొరికిపోతావు, భద్రం!

బల - ముసలయ్యగారూ, అలాంటి భయాలు పడవలసిన అవసరం నాకేమీ లేదు. కటకం బాగా ఎరిగినవారే అయితే, సేనాధిపతి శంకరయ్యగారన్న కోటీశ్వరుడిని మీకు తెలిసే ఉంటుంది.

ముస— తెలియక పోవడమేం? బాగా తెలుసును. నాకంటే ఆయనను బాగా తెలిసినవాళ్లు మరి లోకంలోనే లేరు.

ధన— శంకరయ్యల సంగతీ, వంకరయ్యల సంగతీ ఎందుకిప్పుడు? వంకర టింకరయ్యవు నువ్వెవడవు?

ముస— ఓపికపెట్టి ఆచిన్నవాడు చెప్పేదేమో చెప్పనియ్యండి. తెలియనివాళ్ళ గురించి అగౌరవంగా మాటాడడమూ మానండి. అబ్బాయి, ఏమిటి సేనాధిపతిశంకరయ్యగారి గురించి నువ్వు చెప్పదలచుకొన్న సంగతి?

బల— ఆ శంకరయ్యగారే నా తండ్రి.

ముస—(ఆశ్చర్యముతో) ఆయనా?

బల— అవును, ఆయనే.

ముస- అబ్బాయీ, మొదటలో నీ మొగంచూచి నిజాయతీ మనిషివనుకున్నాను. ఇంత గోలకొండ డచ్చీయేనా? ఇంతకంటే నప్పే తగిన కథ ఏదో కల్పనచెయ్యి. అంతేగాని ఈకథతో కాలక్షేపం చేద్దామంటే కష్టం వస్తుంది.

బల - అయ్యా, ముసలయ్యగారూ, కొంచెం వెనకా ముందూ ఆలోచించి మరీ మాటాడండి. ముసలివారని ఊరుకుంటున్నాను. నేను కథలు కల్పించి చెప్పవలసినవాడనుకాను.

ముస—ఇంకా అదేమాటా? సేనాధిపతి శంకరయ్యగారే నీతండ్రిగారా? ఏదీ నాముఖంచూచి జంకకుండాచెప్పు.

బల—జంకెందుకు? శంకరయ్యగారు నాతండ్రిగారు. కాదన్నవాళ్లు వచ్చి నాఎదట నిలబడితే చెప్పుతాను.

ముస—భేషు! భేషు! నీ భేషజం అంతకంతకూ ముదురుతూ ఉంది. ఓయీ వేషధారీ, నిజంచెప్పుతాను విను. ఇకనీనోరు కట్టుపడుతుంది. ఇప్పటికి పదారేళ్లయి ఆశంకరయ్యగారు ఓడప్రయాణంచేస్తూ, తుఫానుకు ఓడ మునిగిపోగా అలుబిడ్డలను దక్కించుకోందామని ఎన్నివిధాల ప్రయత్నించిన్నీ సాధ్యపడక ఆయనకూడా మునిగిపోయినట్టు వదంతి.

బల—ఆసైని నేను చెప్పుతాను వినండి, మీనోరు కట్టుపడుతుంది. అప్పుడు శంకరయ్యగారి కొడుకుకేడేళ్లు ఈడు. ఆచిన్నవాడిని నౌకరివాడొకడు అదృష్టవశాత్తూ బ్రదికించాడు. ఆలాగు తల్లిదండ్రులు చనిపోగా మిగిలిన దురదృష్టవంతుడను నేనే. పెద్దైదిగిన తరువాత తల్లిదండ్రుల చావుగురించివిని, విరక్తిపుట్టి ఏలాగైనా చచ్చిపోవాలంగదా అని సిపాయి ఉద్యోగానికి కుదురుకొన్నాను. ఇంతలో నాతండ్రిగారు బ్రదికి ఉన్నారన్న గాలిపుకారు విని బయలుదేరి కటకం వెళ్ళుతూ, దారిలో ఇక్కడ ఈ ధనదాసుగారి కుమార్తెను చూచి, ఈ చిన్నదాని సౌందర్యంచేత కట్టుబడి, కాళ్లు కదపలేక, ఇక్కడే నిలిచిపోయి ఇంకొక విధంగా కార్యం సానుకూల్యం అయేటట్టు కనబడక పోవడంచేత వీరిదగ్గిర జీతమూ బత్తెమూ అడగకుండా గుమస్తాపనికి కుదురుకున్నాను. నాతల్లిదండ్రులనుగురించి బోగట్టా చెయ్యడానికి తగిన మనుష్యులను పంపడంమాత్రం మానలేదు.

ముస—ఇదంతా నీకల్పనాశక్తి కాదనడానికి ఏమైనా నిదర్శనాలున్నవా ?

బల—ఏంనిదర్శనాలుకావాలి ? మాతండ్రిగారు నావేలుకు తొడిగారు, నా పేరు చెక్కిన ఉంగరం, అదొకటీ; మాతల్లి నామెడకు కట్టించిన, వెనకపక్క నాపేరిపొడక్షరాలు చెక్కిన హనుమంతబిళ్ల, అదొకటీ; నన్ను బ్రదికించిన నానౌకరు పెద్దన్న ఒకడూ;—ఇంతకంటే మరి నిదర్శనాలు లేవు.

రాధ—ఆహా ! అన్నయ్యా, ఏం నాఅదృష్టం ! నువ్వునాకుదక్కావు. (మీదపడి కౌగిలించుకొని) నాకు సంతోషం పొంగి పొరలి వస్తూఉంది; సంతోషం ఇముడక ఒళ్ళు తిరుగుతూ ఉంది.

బల—(మెల్లగా విడిపించుకొని) నువ్వు నాచెల్లెలవా ?

రాధ—అవును. నువ్వు మాటలాడడం మొదలు పెట్టగానే నామనస్సు ఆందోళనపడ మొదలు పెట్టింది. అమ్మ—ఆహా! అమ్మా! ఇకనువ్వు బ్రతికి పోతావే, అన్నయ్య దొరకడంచేత నీప్రాణం నిలుస్తుందే,— అన్నయ్యా, అమ్మ మన ఇంటి ముచ్చట్లు ఎన్నోమాట్లు చెప్పగా నేను విన్నాను. నువ్వు చెప్పినదంతా అక్షరాలా నిజం. ఆలాగు ఓడ మునిగిపోయినప్పుడు దైవకటాక్షంచేత మేమూ బ్రతికాం. ఏయే దేశాలలోతిరిగి, ఎన్నెన్ని కష్టాలలోపడి, కడపటికి కటకంచేరుకొన్నాం. మనకున్న భూములు అసలే కొద్ది; అవి దాయాదులాక్రమించుకొన్నారు. నాన్నగారిజాడాజవాబూ తెలిసిందికాదు. జంగుళూరులో అమ్మ పుట్టింటివారుంటే అక్కడికి వెళ్లాం; వాళ్లు యుద్ధాలకు పటాలాలతో వెళ్లిపోయారట. అప్పుడిక్కడికి వెళ్లిపోవచ్చి, ఒంటినున్న పసరూ పిప్పీ అమ్ముకొని కాలక్షేపం చేస్తున్నాం.

ముస—ఆహా! భగవంతుడా, బ్రహ్మేంద్రాదులకైనా నీమహిమ తెలియ వశం కాదుగదా? అఘటనఘటనాశక్తి నీదే గాదా? పిల్లలారా, రండి రండి; నన్ను కౌగిలించుకోండి; ముసలి కాలంలోనైనా నా ముద్దు తీర్చండి.

బల—మీరు మానాన్నగారా?

రాధ—మీ కోసమే నా మాఅమ్మ ఏడుస్తూ ఉండేది?

ముస—నాముద్దుకూతురా, నాకోసమే; నాముద్దుకొడుకా, నేనేమీనాన్నను. అప్పుడు సముద్రంలో పడి చచ్చిపోయానని అందరూ నమ్మిన సేనాధిపతి శంకరయ్యను నేనే. అదృష్టవశాత్తూ నేను బ్రదికాను. సొమ్మెల్లా నోట్ల రూపంగా తోలుసంచిలో నాఒంటనే ఉండడంచేత అదీ దక్కింది. కొద్దిగా భూములు మాత్రమే దాయాదుల పాలయినట్లు అమ్మాయి మాటల మూలంగా తెలుస్తూ ఉంది. మీరు బ్రతికి ఉన్నారేమో కనుక్కోవడానికి ఈపదారేళ్లూ ప్రయత్నాలు చేసి చేసి, చివరికి విసిగి, నాదుఃఖం ఏలాగైనా తగ్గుతుందేమోఅన్న ఆశతో వినయవంతురాలూ బుద్ధిమంతురాలూ అయిన పిల్లను పెళ్లిచేసుకొందామని ఊహించాను. ఇన్ని కష్టాలు కలిగిన తరవాత కటకం తిరిగీ వెళ్లడానికి మనస్కరించక, ఇక్కడకు వెళ్లిపోవచ్చినాను. ఆసేనాధిపతి శంకరయ్యను నేనే అని తెలియడం ఇష్టం లేక, నా ముసలితనాని కనుగుణ్యంగా ముసలయ్య అని పేరు మార్చుకొన్నాను.

ధన—అయితే ముసలయ్యగారూ, ఈబలరాం మీ కొడుకేనా?

ముస—అవునండి, నా కొడుకే. నా అదృష్టం కొద్దీ దొరికాడు.

ధన—అయితే ఇతడు దొంగలాడిన వెయ్యిరూపాయిల సొమ్మూ మీరచ్చుకో వలసి ఉంటుంది

ముస—నా కొడుకు మీ దగ్గిర దొంగతనం చేశాడా?

ధన—అవును, చేశాడు.

బల—ఎవడన్నాడు, ఈలాటి జూటా మాట?

ధన—ఈ జగ్గన్న.

బల—(జగ్గన్నతో) అయితే నీ దేనా ఈలాటి పేలాపన?

జగ్గ—(బలరాంతో) ఏమైనా పేలాపన చేస్తున్నానేమో మీరే చూడండి బాబూ.

ధన—వాడే చెప్పాడు; సబ్బినస్పెక్టరుగారు వాంగ్మూలం కూడా పుచ్చుకుంటారు.

బల—వాడు చెప్పితే చెప్పాడుగాని, నేనీలాటి నీచకార్యం చేశానంటే మీ రేలాగు నమ్మారండీ, మామగారూ?

ధన—ఏలాగు నమ్మితే ఏం? నా సొమ్ము నాకు కావాలి.

[సుందరం, రామన్న, ప్రవేశింతురు.]

సుంద—నాన్నగారూ, మీ సొమ్ముకోసం చింతపెట్టుకోకండి. ఎవరిమీదా నిష్కారణంగా నీలాపనిందలు మోపకండి. మీ సొమ్మెక్కడుందో ఆ బోగట్టా నాకు వచ్చింది. రాధను నేను పెళ్లాడడానికి మీ రొప్పకొనే పక్షానికి మీ సొమ్ము మీకు తిరిగీ వస్తుంది.

ధన—ఎక్కడుంది? ఎక్కడ? చెప్పు, త్వరగా చెప్పు, నీళ్లునమలక వేగంగా చెప్పు.

సుంద—మీ రాలాగు ఆయాసపడబోకండి. సొమ్ముకు వచ్చిన భయంలేదు; దానికి నేను జవాబుదారీ. అయితే మీరు నే నడిగినదానికి ఒప్పు

కొంటారో లేదో దానినిబట్టి ఉంటుంది, మీసొమ్ముమీకు దక్కడం దక్కకపోవడమున్నూ. మీరు రాధనైనా వదులుకోవాలి, మీ సొమ్ము పెట్టెనైనా వదులుకోవాలి. ఏం నిశ్చయించారో త్వరగా చెప్పండి.

ధన—పెట్టెలోనుంచి పైకి ఏమీ తియ్యలేదు గదా ?

సుంద—ఒక చిల్లిగవ్వయినా తియ్యలేదు; అణాపైసలతో అప్పజెప్పుతాను రాధను నేను పెళ్లాడడానికి మీ రొప్పుకొంటారా? లేదా? ఆచిన్న దానికిష్టం ఉన్నమాట విని, ఆమెతల్లి అనుమతి పడింది; ఇక మీ అనుమతే కావాలి.

రాధ—అయ్యో! ఇంకా మీరు పెరటిదారిలోనే ఉన్నారు. తల్లే కాకుండా నాకిప్పుడన్నగారొకరున్నారు; నాన్నగారొకరున్నారు. వాళ్ల అనుమతీ అవసరమే.

ముస—దొరకక దొరకక నా అదృష్టం కొద్దీ మీరు నాకు దొరికినప్పుడు మీ ఇష్టాలకడ్డు వస్తానా? ధనదాసుగారూ, పడుచువాళ్లమీద కాక పోతే మనలాటికాలం గడిచిన వాళ్లమీదకు వెళ్లుతుందా మనస్సు పడుచులకు? వివాహంవిషయమై పోటీవచ్చినప్పుడు తండ్రులు ఓడి పోవడం, కొడుకులు గెలవడమున్నూ సహజమే. ఇందుకు మీసంగతీ నాసంగతీ కూడా తార్కాణం. అందరిచేతా అనరానిమాటలూ అనిపించుకోవడం ఎందుకు? ఈరెండు పెళ్లిళ్లకూ ఒప్పుకోండి; మరి రండి, అయిపోయినపెళ్లీ కావలసినపెళ్లీ కలిపి వేడుకగా చేదాం.

ధన—నాకు మతిచెదిరి ఉంది. నా సొమ్ముపెట్టి మొట్టమొదట చూస్తేనే తప్ప, ఇప్పుడు నేనేమీ చెప్పలేను.

సుంద—నాన్నగారూ, దానిని భద్రంగా తెచ్చి మీకప్పగించేపూచీ నాది.

ధన—నా పిల్లలకు కట్నాలూ కానుకలూ, నగలు నాణేలూ, పెట్టడానికి నాదగ్గిర సొమ్మేమీ లేదు.

ముస—పోనీండి నాదగ్గిర కొద్దో గొప్పో సొమ్ముంది మీకా బెంగ అక్కర లేదు.

ధన—రెండు పెళ్లిళ్లకూ ఉభయతరఫుల కర్చూ పెట్టుకోవడానికి మీరు పూచీ పడతారా ?

ముస—అలాగే పూచీ పడతాను. ఇక మీకు సమాధానమయిందా?

ధన—సమాధానమే కాని. నాకు పెళ్లికి తగిన మంచి బట్టలు లేవు ; ఇప్పుడు కొనుక్కోవడానికి తూగలేను.

ముస—నేను కొని పెడతాను. మరిరాండి; ఈవేళ కలిగిన సంతోషానికి తగిన వేడుకలనుభవిద్దాం.

సబ్బ—ఆగండి, ఒక్క మాటాగండి. అంత మించి పోయిందేమీ లేదు. నేను కేసుదర్యాప్తు చేశాను గదా, దానికేమంటారు ?

ధన—మీదర్యాప్తుతో మాకేమీ ప్రసక్తి లేదు.

సబ్బ—అలాగే? అయితే మీ కచ్చేండి చేశాననుకొన్నారా? చూచుకొండి, మరి రిపోర్టు వ్రాశేస్తాను తరవాత.

ధన—అయితే మీకు కలిగిన శ్రమకు ఈజగ్గన్న గాడిని ఉరితియ్యించండి. అడ్డ దిడ్డపు తప్పసాక్ష్యం చెప్పాడు.

జగ్గ—నన్నేనా ఉరితియ్యడం? నేనేం చేశాను? నిజం చెప్పినా రంకే, చెప్పక పోయినా రంకే. మాటాడితే మరా మేకు లాగుంది.

ముస—ధనదాసుగారూ, ఈ సంతోషసమయంలో ఈ జగ్గన్న మాత్రం ఎందుకు దుఃఖపడాలి? వీడిని క్షమించండి.

ధన—అయితే సబ్బినస్పెక్టరుగారికి ఏమైనా ఇచ్చి మీరే సంతోష పెడతారా?

ముస—ఆలాగే కానియ్యండి.

జగ్గ—ముసలయ్య బాబుగారూ,—కాదండోయి బాబు, బాబూ, పొరపాటొచ్చింది; లెంపలు వాయించుకొంటున్నాను;—శంకరయ్య బాబుగారూ, దండాలు.

ముస—పిల్లలారా, మరి ఆలస్యం చెయ్యక రండి. ఈ సంతోష వార్తలన్నీ మీ తల్లితో చెప్పడానికి.

ధన—నేనూ ఆలస్యం చెయ్యక వెళ్లాలి, నాముద్దు గులుకు సొమ్ము పెట్టెని తిరిగీ చూడడానికి. [అందరును నిష్క్రమింతురు.]

సమాప్తము.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B125 |
| పుస్తకం పేరు | లుబ్ధాగ్రేసరచక్రవర్తి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 77TO84 |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | ch.Ramya |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |